# జెమ్స్‌తో బలే మజా

అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

ఇక్కడ లేని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం?






త్వరపడండి!

ఎంట్రీలు గ్రహింపబడేందుకు ఆఖరు తేది: 10-8-1979




మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్‌యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ పెద్దది (30 గ్రాములది) ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్కులు లభిస్తాయి.

మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి.





మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.

"Fun with Gems", Dept. No. C-12
Post Box No. 56,
Thane 400 601, Maharashtra.

## చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్

CHAITRA-C-263 TEL

# చందమామ

జూలై 1979

★

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [ "క్షమించరాని ద్రోహి" ] కి ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన. మనుషుల ప్రవర్తనను సరిగా అంచనా వెయ్యాలంటే ఆ ప్రవర్తనకు గల ప్రేరణనూ, ప్రవర్తన యొక్క ఫలితాలనూ కూడా సరిగా తెలుసుకోవాలి. చాలామంది స్వార్థంతో చాలా "మంచిగా" ప్రవర్తిస్తారు. పిరికితనం మంచితనంగా చలామణీ కావటం కద్దు.

## అమరవాణి

దారిద్ర్యస్య పరామూర్తిః యాచ్ఞా న ద్రవిణాల్పతా.
జరద్గవధన శ్శంభుః తథాపి పరమేశ్వరః.

[ దారిద్ర్యానికి పరకాష్ఠ యాచన, డబ్బు లేకపోవటం కాదు. ముసలి ఎద్దు మాత్రమే కలవాడైనా శివుడు పరమేశ్వరుడే, అంటే ఐశ్వర్యవంతుడే! ]

సంపుటి 65 జూలై '79 సంచిక 1

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00




బి. గోపీకృష్ణ, వెల్లూరు (ఆంధ్ర)

ప్ర: భూమి బరువు ఎలా కనుగొనబడినదో వివరించగలరా ?

న: "బరువు" అనేది ఒక వస్తువులో గురుత్వాకర్షణ శక్తివల్లగాని, శక్తి ప్రయోగంవల్లగాని ఏర్పడుతుంది. ఒకే వస్తువు బరువు నేల మీదా, ఎత్తయిన కొండ మీదా, భూమధ్య రేఖ మీదా, ధ్రువ ప్రాంతాలా వేరు వేరుగా ఉంటుంది. ఇది ఇలా ఉండగా వస్తువులకు "స్వేచ్ఛాపతనం" అనేది ఉంటుంది. ఆ స్థితి భారరహిత స్థితి. కృత్రిమ ఉపగ్రహాలలో తిరిగే వారికి బరువు ఉండదు. అలాగే సూర్యుడి చుట్టూ భూమి తిరగటం దాని "స్వేచ్ఛాపతన" స్థితి. భూమికి బరువు ఉండదు. ఎగ్జిబిషన్‌లలో "జయంట్ వీల్" ఎక్కారా? అందులో మనం పైకి పోయేటప్పుడు మన బరువు కొద్దిగా పెరుగుతుంది. కిందికి దిగేటప్పుడు కొద్దిగా తగ్గుతుంది. భూమికి గురుత్వాకర్షణ శక్తి ఉండటంవల్ల దాని మీద ప్రతి వస్తువుకూ అంతో ఇంతో బరువు ఉంటుంది. చంద్రగోళం మీద కూడా గురుత్వాకర్షణ శక్తి ఉంటుంది. కాని భూమికి ఉన్న దానిలో ఆరోవంతు మాత్రమే ఉంటుంది. అంటే భూమి మీద కంటె చంద్రుడి మీద వస్తువుల బరువు ఆరింతలు తక్కువ. గురుత్వాకర్షణ వస్తువులోగల "ద్రవ్యం"వల్ల ఏర్పడుతుంది. బరువైతే మారుతుందిగాని, ద్రవ్యం ఎప్పుడూ ఒకటిగానే ఉంటుంది. భూమిలోనూ, చంద్రుడిలోనూ కూడా ద్రవ్యం ఉన్నది గద. అందుచేత రెండూ ఒకదాని నొకటి ఆకర్షించుకుంటాయి. అయితే చంద్రుడి ఆకర్షణ శక్తికన్న భూమిది చాలా హెచ్చు. అంచెల రాకెట్ల సహాయంతో అంతరిక్షయానాలు చేసేవారికి రాకెట్లు మండినంత కాలమూ వేగం పెరుగుతూ ఉంటుంది. ఆఖరి రాకెట్ మండటం అయిపోగానే అంతరిక్ష నౌక "స్వేచ్ఛాపతనానికి" గురి అవుతుంది. తగిన వేగం ఉంటే అది భూమి యొక్క ఆకర్షణ పరిధిని దాటి చంద్రుడి ఆకర్షణ పరిధిలో ప్రవేశించి మళ్ళీ వేగ వృద్ధి చెందవచ్చు. అప్పుడు అంతరిక్ష యాత్రికులకు మళ్ళీ కొంత బరువు వస్తుంది. కాని వారు చంద్రుడి చుట్టూ కక్ష్యలు తిరగటం మొదలు పెడితే తిరిగి బరువు పోతుంది. సూర్యుడి చుట్టూ కక్ష్యలలో తిరుగుతున్న ఏ గ్రహానికి బరువు ఉండదు.




## 73

మిత్రులు నలుగురూ చెప్పిన దానికి సంతోషించి భైరవానందుడు వారు నలుగురికీ నాలుగు మంత్రపు వత్తులు తయారు చేసి ఇస్తూ, ''హిమాలయాలకు వెళ్లండి. ఆ ప్రాంతంలో ఎక్కడ వత్తి పూర్తిగా కాలిపోయి, పడిపోతుందో అక్కడ తప్పక నిధి ఉంటుంది. దాన్ని తవ్వి తీసుకోండి. ప్రకృతినియమాలు ఉల్లంఘించ వద్దు. మీ దారిద్ర్యం తీరేపాటి ధనం దొరకగానే ఇళ్ళకు తిరిగి పొండి,'' అన్నాడు.

ఆ నలుగురు ఆయనకు ధన్యవాదాలు చెప్పి, హిమాలయ ప్రాంతానికి బయలుదేరి వెళ్ళారు. వాళ్లు హిమాలయపు తొలి మెట్లు దాటుతూండగా అల్పలోభి చేతిలోని వత్తి మండి, రాలిపోయింది. వాడు అక్కడ తవ్వేసరికి రాగినాణాల నిక్షేపం దొరికింది.

వాడు సంతోషించి, ''మనం మోయగలిగినన్ని నాణాలు తీసుకుని ఇంటికి పోదాం,'' అన్నాడు.

''ఓరి పిచ్చివాడా! ఈ పనికిమాలిన రాగి మన దారిద్ర్యాన్ని ఏం తీర్చుతుంది? ముందుకు పోదాం పద,'' అన్నారు మిగిలిన ముగ్గురూ.

''మీరు వెళ్ళండి. నేను రాను. నాకు ఈ రాగి డబ్బు చాలు,'' అంటూ అల్పలోభి మూడు వేల రాగి డబ్బులు మూట గట్టుకుని, ఇంటికి తిరిగిపోయాడు.

మర్నాడు మితలోభి వత్తి మండి, నేల మీద పడిపోయింది. వాడు అక్కడ తవ్వేసరికి వెండి నాణాల నిక్షేపం కనిపించింది.

వాడు పరమానందంతో, ''మనం మొయ్యగలిగినంత డబ్బు తీసుకుని ఇంటికి పోదాం పదండి,'' అన్నాడు.



దానికి మిగిలిన ఇద్దరూ, ''మొదట రాగి డబ్బు దొరికింది. ఇప్పుడు వెండి దొరికింది. ఈసారి బంగారం దొరుకుతుంది కనక ముందుకు పోదాం,'' అన్నారు.

''నాకీ వెండి చాలు. ఇక నేను ముందుకు రాను,'' అని మితలోభి అయిదు వేల వెండి నాణాలు తీసుకుని, ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు.

మిగిలిన ఇద్దరూ ముందుకు సాగారు. మర్నాడు అతి లోభి వద్ద ఉన్న వత్తి మండి, కింద రాలిపోయింది. అక్కడ తవ్వగా బంగారు కాసుల నిధి కనబడింది.

''మనం వీటిని మోయగలిగిన మట్టుకు తీసుకుని, ఇంటికి తిరిగి పోదాం,'' అన్నాడు అతిలోభి పరమ సంతోషంతో.

దానికి అత్యంత లోభి, ''ఓరి మూఢుడా! మొదట రాగి, తరవాత వెండి, ఇప్పుడు బంగారం! ఈసారి దొరికే నిధిలో వజ్ర వైడూర్యాది నవరత్నాలూ ఉంటాయి. వాటిలో ఒక్కటి చాలు, జీవితాంతం దారిద్ర్యం లేకుండా బతకటానికి! అలాటప్పుడు మొయ్యగలిగినన్ని రత్నాలు తీసుకున్నామో, రాజ్యాలకు రాజ్యాలే కొనెయ్యవచ్చు. నువు మొయ్యగల బంగారమంతా కలిపి ఒక్క వజ్రం విలువ చెయ్యదు. ఈ ముష్టి బంగారం మోసుకుపోకపోతేనేం?'' అన్నాడు.

దానికి అతిలోభి, ''మిత్రమా, నాకు బంగారం చాలు. మనం బయలుదేరింది దారిద్ర్యం నుంచి విముక్తి పొందటానికే గాని, రాజ్యాలు కొనెయ్యటానికి కాదు. మనం జన్మలో ఎన్నడూ తాకి కూడా ఎరగమే. అలాటి దాన్ని ముష్టి బంగారం అంటున్నావా? నా ప్రాణానికి ఇది ఎంతో విలువైనది. దీనితో నేను యావజ్జీవం ధనవంతుడుగా ఉండి, దారిద్ర్యాన్ని జయించగలను. అంతకుమించి నేనేమీ కోరను. అత్యాశ పనికి రాదు,'' అన్నాడు.

దానికి అత్యంత లోభి, ''ఇంకా నయం. ఆశకొద్దీ అర్జన! ఈ మాట నేను

రుజువు చేస్తాను. ఈ చెత్త ఇక్కడే వది లేసి, నా వెంటరా,'' అన్నాడు.

''నేనిక ముందుకు రానులే. నీ కోసం ఇక్కడే వేచి ఉంటాను. ఇద్దరమూ కలిసి తిరిగిపోదాం,'' అన్నాడు అతిలోభి.

అత్యంత లోభి ఒంటరిగా ముందుకు సాగాడు. కొండలు పోయినకొద్దీ చాలా మొరటుగానూ, దుస్సహంగానూ ఉన్నాయి. మూడు రోజులు గడిచినా అతని వత్తి మండి, రాలే లక్షణాలు కనబడలేదు. వాడు ఒక లోయ ప్రవేశించాడు. అది నిర్జనంగానూ, నిర్జలంగానూ కనబడింది. ఎండ మండిపోతున్నది. ఎక్కడన్నా చుక్క నీరుగాని, ఒక్క చిన్న ప్రాణిగాని కనబడుతుందేమోనని చూశాడు వాడు. కాని చిన్న పురుగైనా కనబడలేదు. సవ్యమైన మార్గం అంతరించి, మెలికలు తిరిగిన కాలి బాటలూ, వాటినిండా ముళ్ల మొక్కలూ ఉన్నాయి. అయినా ఆశ ప్రేరేపించగా వాడు ముందుకే వెళ్ళాడుగాని, అతిలోభి వద్దకు తిరిగిపోయే ఆలోచన చెయ్యలేదు. బంగారంతో తృప్తి పడదాం లెమన్న ఆలోచన వాడికి కలగలేదు.

పోగా, పోగా ఒక పల్లపు ప్రాంతం వచ్చింది. దాని చుట్టూ కొండలు కమ్ముకుని ఉన్నాయి. అక్కడ ఒక మనిషి



ఉన్నాడు. వాడి తల మీద ఒక చక్రం తిరుగుతూ, వాడి రక్తాన్ని మధిస్తున్నది. వాడి ముఖమంతా రక్తం ఓడుతూ, వాడి శరీరం మీదికి కారుతున్నది.

అత్యంత లోభి ఆ మనిషిని సమీపించి, ''అయ్యా, నువ్వెవరు? ఇక్కడ నిలబడి, నీ నెత్తి మీద ఎందుకు చక్రాన్ని తిప్పుతున్నావు? రత్నరాసుల నిధులు కనిపెట్టటానికి ఇదొక యజ్ఞం కాదుగదా? ఇక్కడెక్కడైనా నీరున్నదా?'' అని అడిగాడు.

వాడిలా అన్న మరుక్షణం చక్రం అవతలి మనిషి తలమీది నుంచి ఎగిరి వచ్చి, అత్యంత లోభి తల మీద నిలిచి,

తిరగసాగింది. వాడు కంగారు పడుతూ, ''మిత్రమా, ఇదేమిటి? ఎంత బాధగా ఉన్నది!'' అన్నాడు.

దానికి రెండోవాడు, ''ఆ చక్రం నీ నెత్తి మీదికి దూకినట్టే నా నెత్తి మీదికీ దూకి, ఇంత కాలమూ దుర్భరమైన బాధ కలిగించింది,'' అన్నాడు.

''అయితే ఇది ఎప్పుడు వదులుతుంది? నెత్తి మీద ఆగకుండా తిరుగుతూ, రక్తం చిలుకుతూ, అమితంగా బాధిస్తున్నది," అన్నాడు అత్యంత లోభి.

''నీలాగే ఎవడన్నా ఒక మంత్రపు వత్తి సంపాదించివచ్చి, నీతో మాట్లాడినప్పుడు ఈ చక్రం నీ నెత్తి నుంచి వాడి నెత్తికి మారుతుంది,'' అన్నాడు ఆ మనిషి.

''నువు ఈ చక్రాన్ని నెత్తి మీద పెట్టుకుని ఎంత కాలంగా ఇక్కడ నిలబడి ఉన్నావు?'' అని అత్యంత లోభి అడిగాడు.

''ఇప్పుడు రాజెవరు?'' అని ఆ మనిషి ఎదురు అడిగాడు.

''నీకు తెలియదా? వీణా వత్సరాజు, ఉదయనుడు,'' అని అత్యంత లోభి జవాబు చెప్పాడు.

''నేను ఎంత కాలం ఇక్కడ నిలబడి ఉన్నానో చెప్పలేను. కాని రాముడు రాజుగా ఉండగా, నేను దారిద్ర్యబాధకు తట్టుకోలేక, నీలాగే ఒక మంత్రపు వత్తి చేత పట్టుకుని వచ్చాను. దురాశతో, నేను సుఖంగా జీవితాంతం సరిపడే దానితో తృప్తి పడక, నా మిత్రులను దాటి ముందుకు వచ్చి, ఇక్కడ ఒక మనిషిని చూశాను. వాడి నెత్తిని ఈ చక్రం మధిస్తున్నది. నేను వాణ్ణి, ఎందుకు ఉన్నావనీ, ఎక్కడన్నా నిధున్నదా అనీ అడిగాను. మరుక్షణం ఆ చక్రం నా నెత్తికి మారింది. ఎన్నో యుగాల పాటు ఇక్కడ బాధ పడుతూ నిలిచి ఉన్నాను. ఏమంటే ఇటుగా ఎవరూ రారు. దేవుడి దయవల్ల, మంత్రపు వత్తి పట్టుకుని నువు వచ్చావు, నన్ను విముక్తుణ్ణి చేశావు,'' అన్నాడు ఆ మనిషి,






## 13

[రాజు దుర్ముఖుడు అన్నిటికీ తెగించి, తన రాజ్యాన్ని ఆక్రమించిన సామంతుణ్ణి తరుముతూ కోట ప్రవేశించాడు. కోట తలుపులు బద్దలు కొట్టేందుకు భల్లూకుడూ, ఉగ్రదండుడూ ప్రయత్నిస్తూండగా, మాయామర్కటం ఒకటి అక్కడికి వచ్చి; కాళీవర్మా, భల్లూక మాంత్రికుడూ రావటంచూస్తూనే, కోటగోడ మీది నుంచి లోపలికి దూకేసింది. తరవాత—]

కాళీవర్మనూ, భల్లూక మాంత్రికుణ్ణీ చూసిన ఉత్సాహంలో తలారి భల్లూకుడు ఎగిరి గంతు వేసి, గండ్రగొడ్డలిని గిరగిరా తిప్పుతూ, "అహ, అయ్యలారా, ఎన్ని రోజుల తరవాత మీ యిద్దరి దర్శన భాగ్యం కలిగింది. ఇక నా కష్టాలు గట్టెక్కి నట్టే!" అన్నాడు.

భల్లూక మాంత్రికుడు ఎనుబోతు మీది నుంచి దిగి, తలారి భల్లూకుణ్ణి సమీపించి, "ఒరే, భల్లూకా, అంతగా ఆనంద పడిపోకు! ఆ వింత కోతిరూపంలో వచ్చినవాడు, నిజంగా కోతికాదు. వాడు మిథ్యామిశ్రు డనే తాంత్రికుడి శిష్యుడైన భ్రాంతిమతి. ముందు వాడు దొంగిలించుకు వచ్చిన నా మంత్రదండాన్ని తిరిగి సంపాదించాలి," అన్నాడు.

తలారి భల్లూకుడు ఏమనేందుకూ తోచక తల ఆడిస్తున్నంతలో, కాళీ



వర్మ ఆశ్చర్యంగా రాక్షసుడు ఉగ్రదండు కేసి చూస్తూ, "తలారి భల్లూకా, ఈ రాక్షసుణ్ణీ, ఏనుగులనూ — ఈ పరివారాన్నంతా ఎలా సంపాయించావు ?" అన్నాడు.

ఆ మాటలకు ఉగ్రదండుడు చిన్నగా నవ్వి, "నువ్వేగదా, కాళీవర్మ అనే క్షత్రియయువకుడివి ? నీ గురించి తలారి భల్లూకుడు చెప్పగా విన్నాను. ఈయనే అన్నమాట, భల్లూక మాంత్రికుడు ?" అని, దూరాన నిలబడివున్న చంద్రశిలా నగరరాజు జితకేతుడి మంత్రినీ, అతడి వెంటవున్న కొద్ది మంది అశ్వికులనూ, సైనికులనూ కాళీవర్మకు చేఎత్తి చూపుతూ, "కాళీవర్మా ! మీ మనుషుల మధ్యకు వచ్చిన రాక్షసుడినైన నన్ను చూసి ఆశ్చర్యపడుతూ కాలయాపన చేయకు. నిన్ను తరుముకు వచ్చిన ఆ సైనికులు రాజు జితకేతుడు పంపిన వాళ్ళని మాయామర్కటం అనగా విన్నాను. వాళ్ళవల్ల రానున్న అపాయన్నుంచి ఎలా ప్రాణాలతో బయట పడాలనుకుంటున్నావు ?" అని అడిగాడు.

కాళీవర్మ తన గుర్రాన్ని వెనక్కు తిప్పి, కత్తి దూసి, ఉగ్రదండుడితో, "నీ పేరేమో తెలియదు. ఇక్కడ యింత మందికీ నాయకుడెవరు ? నువ్వా, తలారి భల్లూకుడా ?" అని అడిగాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఆ ప్రశ్నకు జవాబు చెప్పబోయేంతలో తలారిభల్లూకుడు, "దిరిశెనవన, భైరవా !" అంటూ కేకపెట్టి, "కాళీవర్మ దొరా, యీ రాక్షసుడు ఉగ్రదండుడికీ, దొంగలనాయకుడు మల్లూ, దుర్ముఖుడి అంగరక్షకులూ — అందరికీ నేనే నాయకుణ్ణి. ఏం చేయమంటారు ? ఆజ్ఞాపించండి," అన్నాడు.

కాళీవర్మ, దిగాలుపడి చుట్టూ కలయ చూస్తున్న భల్లూకమాంత్రికుడితో, "గురూ, తమ ఆజ్ఞ ఏమిటి ? ఒకసారి తమ శక్తి ఎలాటిదో చూసిన ఆ జితకేతుడి మంత్రి జీవగుప్తుడు మనమీద దాడి చేస్తా

డనుకోను. చూడండి, అలా దూరంగా గుర్రం మీద కూర్చుని ఎలా వణికిపోతు న్నాడో,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు నిరుత్సాహంగా ఒకసారి మూసి వున్న కోటద్వారాలకేసి చూసి, ''నా గురువును చిక్కులపాలు చేసిన తాంత్రికుడి శిష్యుడైన ఈ మాయా మర్కటుడు, చాటుగా నన్ను వెన్నంటి వస్తున్నాడని తెలియక మంత్రదండాన్ని పోగొట్టుకున్నాను. వాడి సంగతి తెలిసి వుంటే, మంత్రదండాన్ని ఆ నది ఒడ్డున చెట్టుకు ఆనించి, నదిలో స్నానానికి దిగి వుండేవాణ్ణి కాదు,'' అన్నాడు.

తలారిభల్లూకుడు గండ్రగొడ్డలిని అడ్డంగా రెండు అరచేతుల మీదా పెట్టు కుని మాంత్రికుడి ముందుకు వచ్చి, ''మాంత్రికప్రభో! ఆ మంత్రదండం పోయిందని విచారించకండి. ఈ గండ్ర గొడ్డలి మంత్రప్రభావం కలదే గదా? దీని ధాటికి ఉగ్రదండుడంతటి రాక్షసుడే హడ లెత్తిపోయాడు. ఇది తీసుకుని నన్ను వెంటనే మామూలు మనిషిని చెయ్యండి," అన్నాడు.

''నువ్వు సమర్పించుకోవలసిన రాజు దుర్ముఖుడి తల మాటేమిటి? కోటలో యీ పాటికి ఆ తల సామంతుడు సూర్య భూపతి కత్తి దెబ్బలకు ఛిన్నాభిన్నమై



వుంటుంది,'' అన్నాడు రాక్షసుడు ఉగ్ర దండుడు.

రాజు దుర్ముఖుడి పేరు వింటూనే భల్లూకమాంత్రికుడు అదిరిపడి, ''తలారి భల్లూకా, ఆ రాజు యింకా బతికే వున్నాడా? సామంతు సూర్యభూపతి' ఎవరు? కోట లోపల యుద్ధం ఎవరెవరి మధ్య జరుగుతున్నది?'' అని అడిగాడు.

తలారిభల్లూకుడు కొద్ది మాటల్లో, తాను రాజు దుర్ముఖుడి వెంటబడి అర ణ్యానికి పోయినప్పటి నుంచి, ఆ క్షణం వరకూ జరిగిందంతా చెప్పి, ''మాంత్రిక ప్రభో, ఆ రాజు మనం అనుకున్నంత దుర్మార్గుడు కాదు. తరవాత మీ యిష్టం!



ముందు నన్ను మనిషిగా మార్చండి. ఈ ఎలుగుబంటి చర్మం లోపల వేడి, ఉక్కలదెబ్బకు తట్టుకోలేక నానా అవస్థా పడిపోతున్నాను.'' అన్నాడు.

''గురూ, పాపం, తలారిభల్లూకుడి మాట కాదనకండి. వాడి రూపం మార్చండి.'' అన్నాడు కాళీవర్మ.

భల్లూకమాంత్రికుడు మంత్రపు గండ్ర గొడ్డలిని చేతికి తీసుకుని, ఏదో మంత్రం పఠిస్తూ, గొడ్డలిని తలారి పాదాలకు తాకించాడు. వెంటనే అతడి పాదాలు మనిషి పాదాలుగా మారిపోయినై. తరవాత గొడ్డలిని అతడి తల వరకూ తాకించుకుంటూ పోయాడు. క్షణాల మీద తలారి భల్లూకం శరీరం అంతా మనిషి శరీరంగా మారిపోయింది గాని, తల మాత్రం భల్లూకం తలగానే వుండిపోయింది.

తను మామూలు మనిషినైపోయానను కున్న తలారి చప్పున భల్లూకమాంత్రికుడి ముందు సాష్టాంగపడి లేస్తూ, ''మాంత్రిక ప్రభో, ఎన్నాళ్ళకెన్నాళ్ళకు నేను తిరిగి మనిషినయాను! ప్రాణాలకెంత హాయిగా వుందో మాటలతో చెప్పటం సాధ్యం కాదు.'' అన్నాడు.

ఆ మాటలకు దొంగ నాగమల్లుతో పాటు అందరూ పెద్దగా నవ్వారు. తలారి ఆశ్చర్యపోతూ వాళ్ళకేసి చూసేంతలో రాక్షసుడు ఉగ్రదండుడు తన రాతిగదతో అతడి తలను తాకుతూ, ''తలారిభల్లూకా! శరీరం కంఠం వరకూ మనిషిదే; మరి తల మాటేమిటి?'' అన్నాడు.

తలారి చప్పున రెండు చేతులతో తల తడివి చూసుకుని పెద్దగా మూలుగుతూ, ''మాంత్రికప్రభో! ఈ అన్యాయం ఏమిటి? మనిషి శరీరం, భల్లూకంతల! మామూలు భల్లూక రూపంకన్న యిది నలుగురిలో నన్ను మరింత నవ్వులపాలు చేస్తుంది.'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు విచారంగా ముఖం పెట్టి, ''తలారిభల్లూకా, అట్టే దిగులుపడకు. ప్రస్తుతానికి ఆ వున్న

తలతో తృప్తి పడు. తల భల్లూకానిదైతే నేం. అందులో వున్న బుద్ధి మనిషిదే గదా? నా మంత్రదండాన్ని ఆ మాయా మర్కట రూపంలో వచ్చిన దుష్టుడు భ్రాంతిమతి అపహరించటంతో, నా మంత్ర శక్తులు కొన్ని క్షీణించినై. అందువల్లే నిన్ను పూర్తిగా మనిషిని చేయలేక పోయాను.'' అన్నాడు.



తలారి భల్లూకుడు కళ్ళ నీళ్ళ పర్యంతమైపోతూ, ''ఈ వింత రూపంలో వున్న నాకు, జితకేతరాజుగారు తిరిగి నగర ప్రధాన తలారి ఉద్యోగం ఎలా యిస్తారు? నా బతుకు తెరువు మాటేమిటి?'' అన్నాడు.

తలారి దుఃఖం చూసి కాళీవర్మ జాలి పడుతూ, అతడి భుజం మీద చేయి వేసి, ''తలారి భల్లూకా, అంతగా విచార పడకు. మాంత్రిక గురువు తన మంత్ర దండాన్ని పోగొట్టుకున్నాడని తెలిసిన రాజు జితకేతుడి మంత్రి జీవగుప్తుడు ధైర్యం పుంజుకుని, మమ్మల్ని హతం చేయాలనే ఉద్దేశంతో సైనికుల్ని వెంట బెట్టుకుని, మా వెన్నంటి యిక్కడికి వచ్చాడు. అదుగో, దూరాన ఆ మంత్రినీ, వెంటవున్న సైనికుల్నీ చూడు.'' అన్నాడు.

తలారి భల్లూకుడు తల తిప్పి, మంత్రి జీవగుప్తుడూ వాళ్ళకేసి చూసి భయంతో చిన్నగా కంపించిపోతూ, ''ఆ రాజుగారి మాటేమోగాని, యీ మంత్రి మాత్రం నిశ్చయంగా నా తల తీయించేస్తాడు. నేను అన్ని విధాలా చిక్కుల్లో పడి పోయాను.'' అన్నాడు జీరబోయిన గొంతుతో.

భల్లూక మాంత్రికుడు మంత్రపు గండ్ర గొడ్డలిని తలారికి తిరిగి యిస్తూ, ''తలారీ భల్లూకా, నీలో ధైర్యం, తెగింపు ఏమాత్రం వున్నా, యీ మంత్రపు గండ్రగొడ్డలి నిన్ను అన్ని ఆపదలనుంచీ కాపాడుతుంది,'' అని నడుం నుంచి వేళ్ళాడుతున్న ఒర నుంచి కత్తి దూసి, ''మర్కటం దొంగి లించుకు పోయిన మంత్రదండం అంత



శక్తి కలది కాకపోయినా, యీ కత్తి నా రక్షణకు చాలు,'' అన్నాడు.

''మరి నా దినభత్యం, నౌకరీ సంగతేమిటి? ఇక్కడున్న దొంగ నాగమల్లులాగా నేను, దారులు కొట్టుకు బతికేంత నీచుణ్ణి కాదుగదా?'' అన్నాడు తలారి భల్లూకుడు.

అతడు మాట ముగించే లోపలే దొంగ నాగమల్లు కోపంతో పెద్దగా రంకె పెట్టి, నడుం నుంచి వేళ్ళాడుతున్న కత్తిని కింద పడవేసి, ''ఒరే, ఎలుగుబంటి తలా, మనిషి శరీరపు సంకరజాతి వెధవా, నేను నీచుణ్ణా? మందిమార్బలం, సైన్యాల సహాయంతో ఏ చచ్చు వెధవైనా రాజ్యాలు పాలించవచ్చు. ఒంటరిగా అడవి దారులు కొట్టి బతకటానికి నిజమైన శౌర్యం, ప్రతాపం కావాలి. నా కత్తి పారేశాను, నీ మంత్రపు గొడ్డలి కిందపెట్టి, నాతో మల్ల యుద్ధానికిరా,'' అంటూ జబ్బలు చరచసాగాడు.

భల్లూక మాంత్రికుడు కళ్ళెర్ర చేసి అందరికేసీ ఓమారు చూసి, కాళీవర్మతో, ''కాళీ! ఈ బుద్ధిహీనులకు తామెంత ప్రమాదకర స్థితిలో వున్నదీ అర్థమైనట్టు లేదు. అందర్నీ పట్టి శిరశ్ఛేదాలు చేసేందుకు ఒక వైపున జితకేతుడి మంత్రి పథకాలు వేస్తున్నాడు. ఇక కోటలో రాజు దుర్ముఖుడు జయించినా లేక సామంతుడు జయించినా, మనకు మేలుకన్న కీడే ఎక్కువ కలిగే ప్రమాదం వున్నది. మర్కటదుష్టుడు వాళ్ళను మన మీదికి రెచ్చగొట్టక మానడు," అన్నాడు.

కాళీవర్మ కోపంగా కత్తి పైకెత్తి, ''మాంత్రిక గురువు చెప్పింది, విన్నారా? ఇక్కడ మీ అందరికీ నాయకుడెవరో తెలుసుకున్నారా?'' అన్నాడు.

ఒక్క రాక్షసుడు ఉగ్రదండుడు తప్ప మిగతా వాళ్ళందరూ, ''కాళీవర్మకూ, జై!'' అంటూ కేక పెట్టారు.

కాళీవర్మ తృప్తిగా తలాడించి, రాక్షసుడు ఉగ్రదండుణ్ణి సమీపించబోయేం

తలో మంత్రి జీవగుప్తుడి దగ్గిరనుంచి ఒక అశ్వికుడు కత్తిని తలకిందులుగా పట్టుకుని, వేగంగా వాళ్ళ దగ్గిరకు వచ్చి గుర్రాన్ని ఆపి, "జితకేత మహారాజుగారి మంత్రి జీవగుప్తుల నుంచి ఒక ముఖ్య సందేశం తెచ్చాను," అన్నాడు.

"ఓహో, అందుకా కత్తిని తలకిందులుగా పట్టుకున్నది! మంచిది. ఏమిటా సందేశం?" అన్నాడు కాళీవర్మ.

"ఇక్కడ వున్న నగర ప్రధాన తలారిని వెంటనే తన సమక్షానికి రావలసిందిగా మంత్రిగారు ఆజ్ఞాపిస్తున్నారు. వచ్చేటప్పుడు రాజుగారివల్ల శిరశ్ఛేద శిక్ష పొంది, తప్పించుకు తిరుగుతున్న కాళీవర్మ అనే నేరస్థుణ్ణి వెంట బంధించి తీసుకురమన్నారు," అన్నాడు మంత్రి జీవగుప్తుడి అశ్వసైనికుడు.

ఆ మాటలకు భల్లూక మాంత్రికుడు చిన్నగా నవ్వి, "ఏం, తలారి భల్లూకా, మంత్రిగారి ఆజ్ఞ విన్నావా? ఏం చేయబోతున్నావు?" అని అడిగాడు.

తలారి భల్లూకుడు ఏమి చేయటానికి తోచనివాడిలా రెండు, మూడు క్షణాల పాటు తల వంచుకు పూరుకుని, తరవాత తల ఎత్తి, "కాళీవర్మ దొరా, ఏమిటి మీ ఆజ్ఞ? ఈ భల్లూకం తలతో నేను చంద్రశిలానగరం పోవటం అంటే, అక్కడ వీధి పిల్లలచేత రాళ్ళ దెబ్బలు తిని ప్రాణాలు పోగొట్టుకోవటమే అవుతుంది," అన్నాడు.



కాళీవర్మ కత్తితో తలారి భల్లూకుణ్ణి మృదువుగా తాకి, "తలారి భల్లూకా, నీ స్వామిభక్తి మెచ్చదగింది. మనం ముందు యీ కోటలో ప్రవేశించి, మాయా మర్కటాన్ని పట్టుకోవటంతో పాటు, యిప్పటికే మించి పోకపోతే, ఆ రాజు దుర్ముఖుడి ప్రాణాలు కూడా కాపాడాలి. రాజు జితకేతుడితో పోల్చితే, దుర్ముఖుడు అన్నివిధాలా ఉత్తముడుగా కనిపిస్తున్నాడు. ఇక మంత్రి జీవగుప్తుడి దూతకు యివ్వవలసిన జవాబు మాట! గండ్ర గొడ్డలితో అతడి తల నరుకుతావో లేక అతడి కత్తిని రెండుగా విరిచి, యిక్కడి నుంచి తరిమేస్తావో—అదంతా నీ యిష్టం!" అన్నాడు.

ఆ మరుక్షణం తలారి భల్లూకుడు, "దిరిసెనవన, భైరవా!" అంటూ భీకరంగా అరుస్తూనే కుప్పించి దూత మీదికి దూకి, అతడి చేతిలోని కత్తిని లాక్కొని, మధ్యకు విరిచి, ముక్కలను దూరంగా విసిరివేస్తూ "ఒరే, దూతాధమా! నేను జితకేతరాజుగారి ఉప్పు తిన్నదానికీ, నగరప్రధాన తలారిగా శిక్షితుల తలలు నరికి చేసిన సేవకూ, చెల్లు! మర్యాదగా మంత్రి జీవగుప్తుడు యిక్కడి నుంచి వెళ్ళకపోతే, అతడి తలను దిరిశెనవన భైరవుడికి బలి చేస్తానని చెప్పు!" అన్నాడు.

జీవగుప్తుడి దూత ఒక చావుకేక పెట్టి, గుర్రాన్ని వెనుదిప్పి పరిగెత్తించేంతలో, బంధింపబడివున్న కోట ద్వారాల వైపు నుంచి ఫెళ ఫెళమంటూ పెద్ద ధ్వనితో పాటు, "కాళీవర్మకూ, జై!" అన్న కేకలు వినిపించినై.

భల్లూక మాంత్రికుడితో పాటు అందరూ ఆశ్చర్యంగా అటు కేసి తలలు తిప్పి చూశారు. కోట ద్వారాలు భగభగమని కాలిపోతున్నవి. వాటి ముందు ఆటవికుడూ, దొంగ నాగమల్లూ, అతడి యిద్దరు అనుచరులూ మండుతున్న ఎండు కట్టెలు ఎత్తి పట్టుకుని ఉత్సాహంగా గంతులు వేస్తున్నారు. —(ఇంకా వుంది)





## క్షమించరాని ద్రోహి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఈ ప్రపంచంలో విశ్వాసమూ, వినయ విధేయతలూ గల వాళ్ళకు స్థానం లేదు. అలాటివాళ్ళు పరమద్రోహులుగా కూడా పరిగణించబడతారనటానికి నిదర్శనంగా నీకు రవీంద్రుడు అనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒక గ్రామంలో పద్మనాభుడూ, వాసుదేవుడూ అని స్నేహితులు ఉండేవారు. ఇద్దరూ ఒకే ఈడువాళ్ళు, ఒకేసారి పెళ్ళిళ్ళు చేసుకుని గృహస్థులయారు. వారిలో వాసుదేవుడికి కాలం కలిసి రాలేదు. అతని భార్య రవీంద్రుడు అనే

## బేతాళ కథలు

కొడుకును కని చనిపోయింది. దాయాదులు వాసుదేవుడి ఆస్తిని కాజేసి, బికారిని చేశారు. తరవాత కొద్దికాలానికే అతను వ్యాధిగ్రస్తుడై, చనిపోబోతూ తన కొడుకు రవీంద్రుణ్ణి పద్మనాభుడికి అప్పగిస్తూ, వాడి యోగక్షేమాలు చూడమని కోరాడు.

పద్మనాభుడు తన మిత్రుడికి ఇచ్చిన మాట నిలబెట్టుకుని, రవీంద్రుణ్ణి తన కొడుకైన శేఖరుడితో సమంగా చూసి, పెంచాడు. శేఖరుడూ, రవీంద్రుడూ ఒక తల్లి బిడ్డలలాగా పెరిగి, తమ గ్రామంలో చదువులు పూర్తి చేశారు.

తరవాత పద్మనాభుడు వారిద్దరినీ ఉన్నత విద్యకోసం రాజధానికి పంపించి, వారి ఖర్చుల నిమిత్తం ప్రతి నెలా డబ్బు తన కొడుకైన శేఖరుడికి అందజేస్తూ వచ్చాడు.

అయితే ఇంటి వాతావరణం నుంచి బయటపడి నగరం చేరగానే శేఖరుడి స్వభావం మారిపోయింది. అతనికి చదువు మీద ధ్యాసతగ్గి వినోదాల మీదా, విలాసాల మీదా హెచ్చింది. అతను తండ్రి పంపే డబ్బు చాలావరకు తాగుడూ, జూదమూ లాటి వాటికోసం ఖర్చు చెయ్య సాగాడు. రవీంద్రుడు మాత్రం చదువు మీదనే శ్రద్ధ ఉంచి, శేఖరుడి ప్రవర్తనను సరిదిద్దబోయాడు, కాని లాభం లేక పోయింది. శేఖరుణ్ణి గురించి పద్మనాభుడికి తెలియబరుచుదామనుకున్నాడు గాని,



అలా చేస్తే శేఖరుడు తన మీద అలిగి, ఇప్పుడు చేస్తున్న కాస్త పాటి ధన సహాయం కూడా చెయ్యడేమోనని భయ పడ్డాడు.

ఒకసారి శేఖరుడూ, రవీంద్రుడూ తమ ఊరికి తిరిగి వచ్చారు. పద్మనాభుడు వారి చదువు గురించి అడిగితే, శేఖరుడు తమ చదువు బాగా సాగుతున్నదని తండ్రికి చెప్పాడు.

రవీంద్రుడు అప్పుడైనా శేఖరుడిలో మార్పు గురించి పద్మనాభుడికి తెలియ నివ్వలేదు.

కుర్రవాళ్లిద్దరూ నగరానికి తిరిగి వెళ్ళే ముందు రోజు పద్మనాభుడి డబ్బు పోయింది. పద్మనాభుడు అందరినీ పిలిచి అడిగితే శేఖరుడు, "రవీంద్రు డేమైనా తీశాడేమో?" అన్నాడు.

పద్మనాభుడు రవీంద్రుణ్ణి శంకించ లేకపోయాడు. ఆ కుర్రవాడు కొడుకు కన్న ఎక్కువగా మసులుతున్నాడు. అయినా పద్మనాభుడు రవీంద్రుణ్ణి కూడా అడిగాడు. రవీంద్రుడు నిర్ఘాంతపోయాడు. ఎందుకంటే, ఆ డబ్బు శేఖరుడు తీసి నట్టు అతనికి తెలుసు. శేఖరుడు డబ్బు తీయటమే గాక, తండ్రి ఎదట రవీంద్రు డితో, "డబ్బు అంతగా అవసరమైతే నాన్నగారిని అడగలేక పోయావా? దొంగ తనం దేనికి?" అన్నాడు.

తాను డబ్బు తీసిన సంగతి శేఖ రుడు తండ్రికి చెప్పలేదనీ, అతను





చేసినది దొంగతనమనీ గ్రహించి, శేఖ రుడి మీద తండ్రికి దురభిప్రాయం కలి గించటం ఇష్టం లేక, రవీంద్రుడు తానే అవసరంకొద్దీ డబ్బు తీసినట్టు ఒప్పు కున్నాడు.

పద్మనాభుడికి మొట్ట మొదటిసారిగా రవీంద్రుడి మీద అసహ్యం పుట్టింది. "నిన్ను ప్రయోజకుణ్ణి చేస్తానని నీ తండ్రికి మాట ఇచ్చి, దాన్ని నిలబెట్టుకోవ టానికి శాయశక్తులా కృషి చేశాను. నా కృషి అంతా బూడిదలోపోసిన పన్నీరు అయింది," అన్నాడు.

రవీంద్రుడు తల వంచుకుని అక్కడి నుంచి వెళ్లిపోయాడు.

తరవాత కొద్ది రోజులకు నగరంలోని ఒక జూదగృహంలో శేఖరుడు ఎవడి మీదనో అలిగి, వాణ్ణి కొట్టాడు. ఆ దెబ్బలకు వాడు చచ్చాడు. శేఖరుడు పారిపోయాడు. కాని హంతకుడు శేఖరుడే అని విని రాజ భటులు అతన్ని పట్టుకున్నారు. ఈ వార్త వినగానే పద్మనాభుడు నగరానికి పరిగెత్తి వచ్చాడు.

శేఖరుడి విచారణ జరిగింది. రవీం ద్రుడు తన సాక్ష్యంతో శేఖరుణ్ణి కాపాడా లని, హత్య జరిగిన సమయంలో శేఖరుడు తమ బసలో తనతోనే ఉన్నాడని చెప్పాడు. కాని శేఖరుడు హత్యచెయ్యటం కళ్ళారా చూసిన వాళ్ళు చాలామంది ఉండటం చేత, శేఖరుడికి యావజ్జీవ ఖైదుశిక్ష పడింది.

నగరానికి వచ్చినది లగాయతు శేఖ రుడు సమస్త వ్యసనాలకూ బానిస అయి, క్రమంగా పతనమై పోయినట్టు పద్మ నాభుడికి తెలియ వచ్చింది. అతను రవీంద్రుడి మీద మండిపడి, "నువు క్షమించరాని ద్రోహివి! మిత్రద్రోహివి! సంఘద్రోహివి! విశ్వాస ఘాతుకుడివి! ఇక నీ మొహం నాకు చూపించకు!" అని తన ఊరికి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పద్మనాభుడు రవీంద్రుణ్ణి ఎందుకు

నిందించాడు? తన కొడుకు తనకు కాకుండాపోయినందుకు తనకొడుకులాటి రవీంద్రుణ్ణి అయినా చూసుకుంటూ జీవితంలో తృప్తి పడ వచ్చుగదా. అలా చేయక అతన్ని కూడా ఎందుకు దూరం చేసుకోవటం జరిగింది? ఒక వేళ ఆయనలో మొదటి నుంచీ ఇద్దరు కొడుకుల మధ్యా భేదబుద్ధి ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''పద్మనాభుడిలో భేదబుద్ధిలేదు. అతను స్నేహం అంటే ఏమిటో, బాధ్యత అంటే ఏమిటో తెలిసినవాడు. రవీంద్రుడు ఆ రెంటనీ ఎరగక పరమద్రోహిగా ప్రవర్తించాడు. అతను తన మిత్రుడి బాగుకోరి ఉన్నట్టయితే, శేఖరుడు వక్రమార్గాన పడినప్పుడే అతని తండ్రికి చెప్పి ఉండవలసింది. మనుషులు లోకాభిప్రాయానికి కట్టుబడి సక్రమంగా ప్రవర్తిస్తారు. నగరానికి పోయినాక శేఖరుడి ప్రవర్తన గురించి సరిఅయిన అభిప్రాయం ఇయ్యగలవాడు రవీంద్రుడు ఒక్కడే. అలాటప్పుడు అతను తన క్షేమం మాత్రమే చూసుకుని, శేఖరుణ్ణి గురించి అతని తండ్రికి చెప్పటానికి వెరిచాడు. అతను అలా చేయకుండా ఉంటే, పద్మనాభుడు తన కొడుకును అదుపులో పెట్టి, అతని పతనాన్ని ఆపి ఉండేవాడు. కాని స్వార్థం చూసుకుని, రవీంద్రుడు శేఖరుడు మరింత పతనం కావటానికి మార్గం ఏర్పరిచాడు. అతను శేఖరుడి దొంగతనాన్నీ, హత్యనూ కూడా కప్పిపుచ్చ యత్నించటంలో స్వార్థమే చూసుకుని, సంఘద్రోహి కూడా అయాడు. చిట్టచివరకు పద్మనాభుడికి కొడుకు శాశ్వతంగా దూరం కావటానికి కారణం రవీంద్రుడు తప్ప మరెవరూ కారు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# శిలావిగ్రహం

వంగదేశాన్ని పాలించిన ధర్మవీరుడు ప్రజల మెప్పుకోరి, పరిపాలన విషయంలో చాలా శ్రద్ధ తీసుకునేవాడు. ఆయన ప్రతి గ్రామాధికారికీ రాజప్రతినిధి హోదా ఇచ్చి, ఏటా గ్రామాధికార్లను రాజధానికి పిలిపించి, వారి నివేదికలు వినేవాడు.

గ్రామాధికార్లు ఆ నివేదికలలో రాజును తెగపొగడి, తమ గ్రామానికి ఉండే అవసరాలు ఏమిటో వివరించి, గ్రామానికి కావలసిన సదుపాయాలన్నీ రాజు ద్వారా చేయించుకునేవారు.

కొంత కాలమయాక ధర్మవీరుడికి, తన మీద ప్రజలకు గల అభిమానాన్ని స్వయంగా తెలుసుకోవాలనిపించింది. ఆయన ప్రతి గ్రామంలోనూ తన శిలా విగ్రహాన్ని నెలకొల్పి, ఆ విగ్రహాలను ప్రజలు ఎలా చూసుకుంటున్నారో చారుల ద్వారా తెలుసుకోసాగాడు. రాజు ఎంత కీర్తి కాంక్షగలవాడైనా, అందువల్ల ప్రజలకు మేలే కలుగుతూ వచ్చింది. అందుచేత ప్రతి గ్రామంలోనూ ప్రజలు రాజుగారి విగ్రహం చుట్టూ అలవ ఏర్పాటు చేసి, అందులో రకరకాల పూలమొక్కలు పెంచి, విగ్రహం మెడలో రోజూ పూలమాలలు వేసి, దణ్ణాలు పెట్టుకుంటూ వచ్చారు.

ఈ సంగతి అనేకమంది చారుల ద్వారా అనేకమార్లు విని రాజు, దేశంలోని ప్రజలకు తన పట్ల గల అభిమానానికి తన్మయుడయాడు.

వంగదేశంలో అన్ని గ్రామాలూ హాయిగానే ఉన్నాయిగాని విక్రమపురి అనే గ్రామం ఒక అసౌకర్యంతో బాధపడసాగింది. ఆ గ్రామాన్ని పీడించినది నీళ్ల సమస్య. దీన్ని గురించి గ్రామాధికారి

రాంబాబు

వీరదాసు రాజుకు తన నివేదికలో తెలిపాడు.

రాజు విక్రమపురి వాసుల కోసం నదీ జలాన్ని బళ్ళ మీద అందజేసే ఏర్పాటు చేశాడు. అయితే ఈ ఏర్పాటువల్ల గ్రామస్థులందరికీ నీరు సమంగా అందటం జరగలేదు.

గ్రామంలో పెద్ద కుటుంబాలకు నీరు సరిపడా అందిన అనంతరం, మిగిలిన కుటుంబాలకు ఒక్కొక్క బిందెడు మాత్రమే మిగులుతూ వచ్చింది.

మరుసటి ఏడు వీరదాసు రాజును చూసి నివేదిక సమర్పించినప్పుడు, "మహారాజా, మీరు బళ్ళ మీద నదీ జలాన్ని మా గ్రామానికి పంపటానికి ఎంతో ప్రయాస పడుతున్నారు గాని, మా సమస్య అందువల్ల తీరేలా లేదు. తమరు మా గ్రామానికి జలవేధులను పంపి, నీరు పడే స్థలాలు ఎక్కడ వున్నవో నిర్ణయించి, ఆ ప్రదేశాన బావులు తవ్వించినట్టయితే, మా నీటి కొరత తీరి పోగలదు," అన్నాడు.

వీరదాసు కోరినట్టే రాజు పదిమంది భూగర్భ జలవేధకులను విక్రమపురికి పంపాడు. వారు ఊరంతా తిరిగి ఎక్కడా నీరు పడే అవకాశం లేదని తెలుసుకున్నారు. అయితే మరికొంత పరిశోధించిన మీదట వాళ్ళ దృష్టి ఊరి మధ్యనున్న రాజుగారి శిలా విగ్రహం కింద నేలమీద పడింది.



జలవేధకులు వీరదాసుతో, "ఈ ప్రాంతాల ఇంకెక్కడా నీరు పడే అవకాశం కనిపించటంలేదు, కాని రాజుగారి శిలా విగ్రహం ఉన్న చోట తవ్వితే నీరు పడుతుంది," అన్నారు.

వీరదాసు రాజు వద్దకువెళ్లి జలవేధుల సూచనను విన్నవించి, విగ్రహం ఉన్న చోట బావి తవ్వటానికి అనుమతి వేడుకున్నాడు.

ధర్మవీరుడు ఆ మాట విని మండిపడి, "ఈ మాట చెప్పడానికి నీ కెంతధైర్యం!" అని, వీరదాసును పదవినుంచి తొలగించి, జలవేధులను పదిమందినీ కారాగారంలో పెట్టించాడు.

తరవాత ధర్మవీరుడు ఒక ఉద్యోగి ద్వారా విక్రమపురికి లోగడకన్న రెట్టింపు నీరు బళ్ళమీద పంపవలసిందిగా ఆజ్ఞలు జారీచేశాడు.

కొంతకాలం గడిచాక రాజు, తన పట్ల విక్రమపురి ప్రజలు ఎలాటి అభిప్రాయంతో ఉన్నారో తెలుసుకునేటందుకు, మారువేషంలో వెళ్ళాడు. శిలావిగ్రహం మట్టి కొట్టుకుని ఉన్నది. దానిచుట్టూ ఉన్న ఆవరణనిండా పిచ్చిమొక్కలు మొలిచి ఉన్నాయి. గ్రామస్థులు తన విగ్రహాన్ని అశ్రద్ధ చేస్తున్నారు. వారికి తన మీద భక్తి పూర్తిగా పోయింది. వారికి తనకన్న కూడా నీరు ముఖ్యం. ఈ మాట వీరదాసుకు బాగా తెలుసు!

ధర్మవీరుడికి జ్ఞానోదయ మయింది. ఈసారి ఆయన జలవేధులను కారాగార విముక్తులను చేసి, విక్రమపురికి పంపి, తన విగ్రహం ఉన్నచోట పెద్ద బావి తవ్వించాడు. వీరదాసును తిరిగి గ్రామాధికారిగా నియమించాడు. రాజు తిరిగి మారువేషంలో ఆ గ్రామాన్ని చూడవచ్చే సరికి, బావి సమీపంలోనే చక్కని పూల తోట మధ్య తన విగ్రహం, పాలరాతిది, కనబడింది.

విక్రమపురి గ్రామస్థులే చందాలు వేసుకుని దాన్ని తయారుచేయించి, ప్రతిష్ఠించుకున్నారు.






# ప్రయాణంలో తోడు

రాజయ్య తల్లి అరవై ఏళ్ళది. ఆవిడ తన పెద్ద కూతుర్ని చూడాలని చాలా రోజులుగా అడుగుతున్నా, రాజయ్యకు తీరికలేకా తల్లిని ఆ వయసులో ఒంటరిగా అంత దూరం పంపటం ఇష్టం లేకా వాయిదా వేస్తూ వచ్చాడు. ఇంతలో తలవని తలంపుగా, పొరుగున ఉండే రాజేశం అనే యువకుడు ఆ ఊరికే ప్రయాణం కట్టటం జరిగింది. తన తల్లికి రాజేశం తోడుగా ప్రయాణం చేసేటట్టు రాజయ్య ఏర్పాటు చేశాడు.

రాజయ్య తల్లి తన మూటలో బట్టలు పెట్టుకున్నది. రాజయ్య తాను స్వయంగా తయారు చేసుకునే శ్రేష్ఠమైన నశ్యం తన బావమరిది కోసం ఒక డబ్బీలో ఇచ్చాడు. ముసలావిడ పిల్లల కోసం కొన్ని సున్ని ఉండలు కట్టుకున్నది. రాజయ్య ఆవిడకు కొంత డబ్బు కూడా ఇచ్చాడు.

రాజేశానికి ముసలావిణ్ణి తన వెంట తీసుకుపోవటం లేనిపోని భారమనిపించింది. అయినా మొహమాటానికి ఒప్పుకున్నాడు. ఊరు దాటగానే అతను ఆవిడతో, "మీ దగ్గిర ఉన్న డబ్బు ఇచ్చేయండి. నా దగ్గిర భద్రంగా దాస్తాను," అన్నాడు.

ముసలావిడ డబ్బిచ్చింది, రాజేశం దాన్ని తన సంచీలో వేసుకుని, భద్రంగా మొలలో దోపుకున్నాడు.

మధ్యాన్నానికి వాళ్ళు ఏదో ఊరు చేరారు. అకస్మాత్తుగా వర్షం ముంచుకొచ్చింది. ఊరి బయట గుడిసెల మధ్య ఒక పెంకుటిల్లు కనిపిస్తే, రాజేశం వాకిలి తలుపు దడ దడా బాదాడు. కిటికీలో నుంచి ఒక స్త్రీ తొంగి చూసి, "ఎవరు నువు? ఏం కావాలి?" అని కోపంగా అడిగింది.

మాచిరాజు కామేశ్వరరావు



''వాన పెద్ద దవుతున్నది. కాస్త మీ ఇంట్లో తల దాచుకోనిస్తే చాలు,'' అన్నాడు రాజేశం.

''వీలుకాదు. ఇంట్లో మగవాళ్ళు లేరు. ఇంకెక్కడికైనా వెళ్ళు.'' అన్నది స్త్రీ నిష్కర్షగా.

అప్పుడు ముసలావిడ కిటికీకి ఎదురుగా వచ్చి, ''వర్షంలో తడిసిపోతున్నాం, తల్లీ. నీకు తల్లిలాటిదాన్ని. మా అబ్బాయి నీకు అన్నలాంటివాడు. తలుపు తియ్యి, పరవాలేదు!'' అన్నది.

ముసలావిణ్ణి చూడగానే ఇంటి ఇల్లాలు లేచివచ్చి, తలుపు తీసింది. క్షణంలో ముసలావిడ మాటలు కలిపేసి, ఎన్నో తరాల చుట్టరికాలు తిరగేసింది. ఇల్లాలు, వద్దన్నా వినిపించుకోకుండా, మళ్ళీ పొయ్యి రాజేసి, ముసలావిడకూ, రాజేశానికీ వేడి వేడిగా వంటచేసి, భోజనం పెట్టింది.

తరవాత వాన వెలిసింది.

''వస్తాం, తల్లీ! చాలా దూరం వెళ్ళాలి.'' అని ముసలావిడ ప్రయాణం అవుతూంటే, ఇంటి ఇల్లాలు, తిరుగు ప్రయాణంలో వచ్చి ఒక పూట ఉంటానని ముసలావిడచేత చేతిలో చెయ్యి వేయించుకుని మరీ పోనిచ్చింది.

''మంచి మాటలతో మనుషుల్ని మన వాళ్ళుగా చేసుకోవచ్చు.'' అన్నది ముసలావిడ రాజేశంతో.

వాళ్ళు డొంక దారిన నడుస్తూండగా ఒక నల్ల తాచు దారికి అడ్డంగా పడుకుని కనిపించింది. దాన్ని చూసి రాజేశం బెదిరిపోయి, గట్టిగా కేకలు పెడుతూ, చప్పట్లు చరిచాడు. అయినా పాము కదలలేదు.

ముసలావిడ తన చేతి కర్రను నేలకేసి గట్టిగా తట్టగానే, పాము తల ఎత్తి చూసి, పక్కనే ఉన్న పొదల్లోకి వెళ్ళిపోయింది.

''పాముకి చెవులు లేవు. నేల అదురుకు అది కదులుతుంది,'' అన్నది ముసలావిడ రాజేశంతో.

పొద్దువాలుతూండగా వాళ్లు ఒక కొండ పక్కగా వెళుతున్న సమయంలో ఎవడో దారిదోపిడిగాడు చప్పున వాళ్ళ ముందు దూకి, చాకు చూపించి రాజేశంతో, "నీ డబ్బంతా అక్కడ పెట్టు!" అన్నాడు.

రాజేశం నిలువునా వణికిపోతూ, తన మొలలో ఉన్న సంచీని ఇచ్చేసే ధోరణిలో ఉండటం చూసి ముసలావిడ, "ఉండు నాయనా! మాయదారి డబ్బుకోసం మనిషి ప్రాణం తీస్తావా? డబ్బు నా దగ్గిర ఉన్నది. లేనివాణ్ణి బెదిరించి ఏం లాభం?" అంటూ మూట విప్పి, అందులో నుంచి డబ్బీ తీసి, దానిమూత తీస్తూనే అందులో ఉన్న నస్యం కాస్తా దొంగవాడి కళ్ళలోకి చల్లింది. దొంగ లబోమంటూ చాకు కింద పారేసి, రెండు కళ్లూ నలుపుకోసాగాడు.

చాకు తీసుకొని రాజేశానికి సైగచేస్తూ ముసలావిడ, "వాణ్ణి పొదవకురా, బాబూ! డబ్బుకోసం ఏదో కక్కుర్తి పడ్డాడు. వాణ్ణి చంపితే మనకేం ఒరుగుతుంది?" అన్నది.

దొంగ అంత బాధలోనూ కళ్లు తెరిచి, దారి సరిగా కనబడక పోయినా, ఉరుకుతూ క్షణంలో ఎటో పారిపోయాడు.

"ఆపదరాగానే ఆలోచన వదిలేసి, భయంతో బిగుసుకుపోతే లాభం లేదు. బుర్ర ఉపయోగించాలి." అన్నది ముసలావిడ. రాజేశం మరోసారి తల వంచుకున్నాడు.



దీపాలు పెట్టేవేళకు వాళ్లు ఒక బస్తీ చేరుకున్నారు. ఇంకా చాలా దూరం వెళ్ళాలి.

"మనం ఊరుచేరేసరికి ఝాముర్రాత్రి అవుతుంది. నాకు ఆకలిగా ఉన్నది. నేను దుకాణంలో ఏదన్నాతిని, మీకు పళ్లు ఏవన్నా తెస్తాను," అంటూ రాజేశం వెళ్ళాడు.

ముసలావిడ ఒక ఇంటి అరుగుమీద కూర్చున్నది. ఎంతకూ రాజేశం రాలేదు. ఏమయిందో నని ఆవిడ దుకాణం వైపుగా వెళ్ళింది.

"ఫలహారం చేసి, డబ్బుసంచీ ఎవరో కొట్టేశారంటున్నాడు! ఇలాటి వాళ్ళను చాలా మందిని చూశాం. డబ్బు ఇయ్యక పోయావో, నీ చేత మూటలు మోయించ కుండా వదలను;" అంటున్నాడు దుకాణం యజమాని రాజేశంతో. చుట్టూ కొందరు మనుషులు పోగయివున్నారు.

ముసలావిడ జరిగినది గ్రహించి, తన మూట విప్పి డబ్బు తీసి, రాజేశం తిన్న దానికి డబ్బులిచ్చి, "ఇక పోదాం పద, బాబూ" అన్నది.

దారిన నడుస్తూ, "నా డబ్బు సంచీ ఎక్కడో జారి పడిపోయినట్టున్నదండీ! కాని ప్రయాణానికి ముందే మీ డబ్బు నా కిచ్చేస్తిరి గదా. ఇంకా మీ దగ్గిర డబ్బెక్కడిదీ?" అని రాజేశం ఆవిణ్ణి ఆశ్చర్యంగా అడిగాడు.

"డబ్బంతా ఒక్క చోట పెట్టుకుంటారా, నాయనా? నాలుగుచోట్ల దాచుకోవాలి గాని!" అన్నది ముసలావిడ.

ఊరికివెళ్ళి కూతురు దగ్గిర ఏ రెండు వారాలో ఉంటుందనుకున్న తల్లి చాలా ముందుగానే తిరిగి రావటం చూసి రాజయ్య, "ఏమమ్మా? అప్పుడే వచ్చావేం?" అని అడిగాడు.

"ఏం చెయ్యను రా? అమ్మాయిని చూసేశానుగా! పాపం, రాజేశం తిరిగి వస్తూ, నన్ను ప్రయాణానికి తోడురమ్మని కాళ్ళా వేళ్ళా పడ్డాడు. సరేనని వచ్చేశాను," అన్నది ముసలావిడ.








ఋషులలో దేవర్షులూ, బ్రహ్మర్షులూ, రాజర్షులూ, విప్రర్షులూ, ఇలా చాలా రకాలున్నారు. దానవుల ఋషులు కూడా ఉన్నారు. వీరిలో అత్రి బ్రహ్మర్షి తెగకు చెందినవాడు. ఈయన బ్రహ్మమానస పుత్రుడు.

అత్రి భార్య అనసూయ. ఆమె గొప్ప తపస్సంపన్నురాలు. ఆ కారణంగా ఒక సారి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు తమ తమ వాహనాల మీద అత్రి ఆశ్రమం మీదుగా మేరుపర్వతానికి పోతూండగా ఆశ్రమం సమీపంలో అవి ఆగిపోయాయి. తరవాత వాళ్ళు మరో మార్గాన పోవలసి వచ్చింది.

ఒకసారి భూమి మీద భయంకరమైన కరువు రాగా, అనసూయ తన శక్తిచేత గంగను భూమి అంతటా ప్రవహింప జేసి, కరువును పోగొట్టింది.

ఇంకొకసారి, కౌశికుడనేవాడు తెల్లవారగానే చచ్చిపోయేటట్టు శాపం పొందాడు. కౌశికుడి భార్య అనసూయ మిత్రురాలు. ఆమెకు వైధవ్యం కలగకుండా ఉండగలందులకు అనసూయ ఒక్క రాత్రి పది రాత్రులంతసేపు ఉండేలాగ చేసింది.

అత్రి కొడుకులను కోరి తపస్సు చేస్తూంటే, త్రిమూర్తులు ప్రత్యక్షమయారట. తాను తపస్సు చేస్తున్నది ఒక్కరి కోసమైతే, ముగ్గురెందుకు వచ్చారని అత్రి వారిని అడిగాడు.

"మేము ముగ్గురమూ మా అంశలు గల కొడుకులను నీకిస్తాం," అన్నారు వాళ్ళు.

ఆ ప్రకారమే అత్రికి బ్రహ్మ అంశన సోముడూ, విష్ణు అంశన దత్తాత్రేయుడూ, శివుడి అంశన దుర్వాసుడూ కలిగారు.

కాని అత్రికి చాలామంది సంతానం ఉన్నట్టు చెబుతారు. అత్రి సంతతివారు ఆత్రేయులు. అత్రి ఒక కులపతి.

శ్రాద్ధవిధి ఎలా ఉండాలో మొట్ట మొదట చెప్పినవాడు అత్రి. పిండ ప్రదానం తండ్రికీ, తాతకూ, ముత్తాతకూ చెయ్యాలనీ, ప్రతి నెలా చేసే శ్రాద్ధం తండ్రికి మాత్రమేననీ అత్రి, నిమికి చెప్పాడు. రాజు దైవాంశ సంభూతుడని మొట్ట మొదట ప్రవచించినవాడు కూడా అత్రి మహామునే.

బ్రహ్మవర్త దేశంలో పృథుచక్రవర్తి తొంభై తొమ్మిది యాగాలు చేసి, సరస్వతీ నదీ తీరాన నూరో అశ్వమేధయాగం చెయ్యబోతూ ఉంటే, ఇంద్రుడు అసూయ పడి అశ్వాన్ని ఎత్తుకుపోయాడు. పృథువు యాగాలు చేసినప్పుడు అత్రి కూడా అక్కడే ఉన్నాడు.

తరవాత అత్రి సంసారం విడిచి తపస్సు చేసుకోబోతూ ఉంటే, కుటుంబ పోషణ మార్గం చూడకుండా నువు తపస్సుకు పోరాదని భార్య చెప్పింది. భూ భారమంతా మోసేవాడు క్షత్రియుడే గనక, అత్రి పృథువు వద్దకువెళ్ళి, "నువు దేవాంశగల వాడివి, ఇంద్రుడివి!" అని పొగడాడు.

ఇందుకు అభ్యంతరం చెప్పాడు అక్కడే ఉన్న గౌతముడు. అయితే సనత్కుమారుడు ఇద్దరి వాదమూ విని, "అత్రి పొగడటం యుక్తమే," అని తీర్పు చెప్పాడు.

పృథుచక్రవర్తి అత్రికి అంతులేని ధనం ఇచ్చాడు. అతని తండ్రి వేనుడు దుష్టుడైన కారణంగా ప్రజలు అతన్ని, "పిచ్చికుక్కను" చంపినట్టు చంపారు. అలాటప్పుడు అత్రీ, సనత్కుమారుడూ లాటి వారిచేత దైవాంశ సంభూతుడని పించుకోవటం పృథువుకు ఎంతో ఆనంద మయింది." బంగారం ఇచ్చినవాడు అన్ని కోరికలనూ తీర్చినవాడే!" అని ప్రవచించినవాడు కూడా అత్రి మహామునే. ఆయన కుబేరుడి ఏడుగురు గురువులలో ఒకడు.





# తులసి జన్మవృత్తాంతం

ఒకసారి ఇంద్రుడు శివుణ్ణి చూడటానికి కైలాసం వెళ్ళి, ఒక రాతి మీద నిశ్చలంగా కూర్చుని ఉన్న ఒక వ్యక్తిని చూసి, శివుడి వద్దకు దారి అడిగాడు. ఆ వ్యక్తి మాట్లాడక పోయేసరికి ఇంద్రుడు తన వజ్రాయుధంతో అతడి నెత్తిన కొట్టాడు.

వెంటనే ఆ వ్యక్తి తల మీది నుంచి దారుణమైన అగ్ని జ్వాలలు లేచాయి. ఎందుకంటే, ఆ వ్యక్తి శివుడే. ఇంద్రుడు శివుడికి క్షమాపణ చెప్పుకుని, జ్వాలలో బూడిద కాకుండా తప్పించుకున్నాడు.





శివుడి నెత్తిన లేచిన అగ్నిజ్వాల ఆకాశంలోకి లేచి, సముద్రంలో పడి, ఒక పిల్లవాడుగా మారింది.



కోపాగ్ని నుంచి పుట్టిన ఆ బిడ్డ మహా భయంకరుడుగా తయారయాడు. సముద్రుడు ఆ బిడ్డను బ్రహ్మకు అప్పగిస్తే, వాణ్ణి భరించటం బ్రహ్మ వల్ల కూడా కాలేదు. వాడే జలంధరు డనే రాక్షసుడు.



కాలక్రమాన జలంధరుడు రాక్షసులకు ప్రభువయాడు. వాడు భూమిపైగల రాజు లందరినీ జయించి, దేవతలను కూడా జయించ నిశ్చయించాడు.



వాడు రాక్షససేనలతో వెళ్ళి ఇంద్రుడి అమరావతి పైన దాడి చేశాడు. ఇంద్రుడిపై శివుడి ఆగ్రహం ఈ రూపంతో తిరిగి ఇంద్రుడిపైకే వచ్చింది. దేవతలు నిస్సహాయులయారు.



యుద్ధంలో ఇంద్రుడూ, దేవగణాలూ ఓడిపోయి, జలంధరుడు అమరావతిని వశపరచుకున్నాడు. ఇంద్రుడు కైలాసానికి వెళ్ళి, జలంధరుణ్ణి నిగ్రహించమని శివుణ్ణి ప్రార్థించాడు.



దుశ్చేష్టలు మానమని శివుడు జలంధరుణ్ణి మందలించాడు. కాని లాభం లేకపోయింది. శివుడు స్వయంగా జలంధరుణ్ణి సంహరించవలసి వచ్చింది. చిత్రమేమిటంటే, శివుడు జలంధరుణ్ణి ఏమీ చెయ్యలేకపోయాడు!



జలంధరుణ్ణి కాపాడిన మహాశక్తి ఏమిటంటే, అతని భార్య బృంద నిత్యమూ చేస్తూ వచ్చిన విష్ణుపూజ. ఆమె తన భర్త క్షేమంకోసం ధ్యానించినంత కాలమూ అతనికి అపాయం జరగదు.



దేవతలు తమకు తోడ్పడమని విష్ణువును వేడుకున్నారు. విష్ణువు చిక్కులో పడ్డాడు. బృంద భర్తకే రాక్షసుడికి అంగరక్షగా ఉన్నది. కాని జలంధరుడు చచ్చి తీరాలి.



విష్ణువు జలంధరుడి రూపంలో బృందను సమీపించాడు. తన భర్త విజయుడై తిరిగి వస్తున్నాడనుకుని, బృంద ధ్యానం మాని లేచింది. ఆ క్షణంలోనే శివుడు జలంధరుణ్ణి చంపేశాడు.



జరిగిన మోసం గ్రహించి, బృంద తన భర్త చితిపైన సహగమనం చేసింది. ఆమె చితాభస్మం నుంచి తులసి మొక్క పుట్టి, విష్ణువుకు అత్యంత ప్రీతిపాత్రమయింది. అందుకే అందరూ తులసిని ఆరాధించి, తులసీదళాలతో విష్ణువును అర్చిస్తారు.



# ప్రహ్లాదుడు

హిరణ్యకశిపుడు బ్రహ్మను గురించి తపస్సు చెయ్యబోయిన సమయంలో అతని భార్య లీలావతి గర్భవతిగా ఉన్నది. అదే సమయంలో దేవదానవులకు యుద్ధం జరిగి, దానవులకు బలవంతుడైన నాయకుడు లేని కారణంచేత, వాళ్ళు యుద్ధంలో ఓడారు.

దానవులపై విజయం సాధించిన ఇంద్రుడికి లీలావతి బందీగా దొరికిపోయింది. నారదుడు ఇంద్రుడితో లీలావతి మహాసాధ్వి అని చెప్పి, ఆమెను విడిచి పెట్టమన్నాడు.

లీలావతి గర్భవతిగా ఉన్న కారణంచేత ఆమె కొడుకును కన్న పక్షంలో వాణ్ణి చంపి, లీలావతిని వదిలిపెట్టుతానన్నాడు ఇంద్రుడు.

"లీలావతికి పుట్టబోయే కొడుకు మహాభక్తుడు అవుతాడు. వాణ్ణి చంపరాదు," అని ఇంద్రుణ్ణి ఒప్పించి, నారదుడు లీలావతిని తన ఆశ్రమానికి తీసుకుపోయి, ఆమెకు తత్వోపదేశం చేశాడు. నారదుడు బోధించిన తత్వం లీలావతి గర్భాన ఉన్న ప్రహ్లాదుడికి వంటబట్టింది. ఆ కారణంచేత అతను పుట్టుతూనే విష్ణుభక్తుడయాడు.

తరవాత హిరణ్యకశిపుడు బ్రహ్మను ప్రత్యక్షం చేసుకుని, ఏ పరిస్థితిలోనూ, ఎవరివల్లా తనకు చావులేకుండా బ్రహ్మవల్ల వరాలు పొంది, తిరిగివచ్చి తన భార్యనూ, కొడుకునూ నారదుడి ఆశ్రమం నుంచి తీసుకుపోయి, ప్రహ్లాదుణ్ణి శుక్రాచార్యుడి కొడుకులైన చండామర్కుల వద్ద చదవవేశాడు.

ప్రహ్లాదుడు చాలా కొద్ది కాలంలోనే శాస్త్రాలన్నీ నేర్చుకుని, తోటి పిల్లలకు వేదాంతమూ, విష్ణుభక్తీ నేర్పసాగాడు.

చండామర్కులు ఎంత చెప్పినా ప్రహ్లాదుడు వినిపించుకో లేదు.

ఒకసారి హిరణ్యకశిపుడు తన కొడుకు చదువు ఎంతవరకు వచ్చినదీ పరీక్షించ గోరి, ప్రహ్లాదుణ్ణి రప్పించి, తన తొడ మీద కూర్చొబెట్టుకుని, ముద్దు చేసి, ఏదన్నా పద్యం చదవమన్నాడు.

వెంటనే ప్రహ్లాదుడు విష్ణు సంకీర్తన చేశాడు.

"విష్ణువు దేవతలకు దేవుడు మనకు విరోధి. ఇప్పుడు మూడు లోకాలకూ నేనే అధిపతిని. అందుచేత నువు విష్ణువును ఏ మాత్రం కీర్తించనవసరం లేదు," అని ప్రహ్లాదుడితో చెప్పాడు హిరణ్యకశిపుడు.

అయినా ప్రహ్లాదుడు తన విష్ణుభక్తిని విడవలేదు. తండ్రిగాని, గురువులుగాని అతని బుద్ధి మార్చలేకపోయారు. ప్రహ్లాదుడు తన వంశానికి కళంకమని నిశ్చయించి, హిరణ్యకశిపుడు వాణ్ణి చంపించటానికి చాలా ప్రయత్నాలు చేశాడు. కొండల మీది నుంచి కిందికి తోయించాడు; పాముల చేత కరిపించాడు; ఏనుగులచేత తొక్కించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. హిరణ్యకశిపుడు నయానా, భయానా చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయిపోయాయి. ప్రహ్లాదుడు చావలేదు, హరిసంకీర్తన చేయటం మాననూ లేదు.

ప్రహ్లాదుడు చూస్తూండగా ఆ హరి అనేవాణ్ణి చంపి, తన గొప్పతనం నిరూపించుకుందామని హిరణ్యకశిపుడు తన కొడుకును, "హరి ఎక్కడ ఉంటాడు?" అని అడిగాడు.

"అంతటా ఉంటాడు," అన్నాడు ప్రహ్లాదుడు.

"ఈ స్తంభంలో ఉంటాడా?" అంటూ హిరణ్యకశిపుడు తన గదతో స్తంభాన్ని పగలగొట్టాడు. అందులో నరసింహమూర్తి కనిపించి, బ్రహ్మ ఇచ్చిన వరాలకు విఘాతం కలగకుండా హిరణ్యకశిపుణ్ణి చీల్చి చంపాడు.






పూర్వం నేపాళదేశానికి సమీపంలో శాక్య రాజ్యం ఉండేది. శాక్యరాజ్యానికి ముఖ్య పట్టణం కపిలవస్తు నగరం. ఈ శాక్యులు ఆనాటి కోసలదేశపు రాజయిన ప్రసేన జిత్తుకు లోబడి ఉండేవాళ్ళు. అలా లోబడివున్నప్పటికీ, జాతిగౌరం పాటించే స్వభావం కలవాళ్ళు కనుక, ఇతర జాతులతో వివాహ సంబంధాలు పెట్టు కొనేవారు కాదు.

కోసలరాజుకు బుద్ధభగవాను డంటే అపరిమితమైన భక్తి. బుద్ధుడు శాక్య వంశస్థుడు కావటంచేత, భగవానునితో ఇంకా దగ్గర సంబంధం పెట్టుకోవాలనే సంకల్పంతో శాక్యవంశ స్త్రీనే తన పట్టపు రాణిగా చేసుకోవాలని కోసలరాజు ప్రసేన జిత్తుడు నిశ్చయించుకొన్నాడు.

తన నిశ్చయాన్ని దూతలద్వారా శాక్యు లకు తెలియచేసి, కన్యాదానం చేయమని కోరాడు. శాక్యులకు గట్టి చిక్కు వచ్చి పడింది. కోసలరాజు ఇష్టప్రకారం చేయక పోతే తమకు నాశనం తప్పదు. చేదా మంటే వారి సంప్రదాయానికి విరుద్ధం. సభలు చేశారు. చర్చలు జరిగినై.

అప్పుడు మహానామ అనే అతడు, "మీరేమీ విచారించకండి, నా కుమార్తె ఐన వాసవక్షత్రియ దాసికి పుట్టిన పిల్ల. లక్షణవతి. ఆమె శాక్యయువతే అని చెప్పి, కోసలరాజు వద్దకు పంపుదాం," అని చెప్పాడు. ఇందుకు అందరూ వప్పు కున్నారు. ఆపద తొలగింది కదా అని సంతోషించారు.

కోసలరాజ్యపు దూతలను మహానామ పిలిచి, "మేము కన్యాదానం చేస్తున్నాం. మీరు ఈ అమ్మాయిని మీ దేశానికి తీసుక పోవచ్చును." అని చెప్పాడు. ఐతే, వంశ మర్యాదలలో శాక్యులు చాలా పట్టుదల




కలవారని దూతలకు తెలుసును. ఇప్పుడు వారు ఇలా సులభంగా వప్పుకోవటంతోనే వాళ్ళకు సందేహం కలిగింది. "ఈ కన్య శాక్యకన్య ఐవుండదు. తమను మోసగిస్తున్నారు," అని దూతలు అనుమానించారు.

"సరే, మీతోపాటు ఒక కంచంలో భోజనం చేసే అమ్మాయి అయితేనే మేము తీసుకు వెళతాం. లేకపోతే లేదు," అని దూతలు పరీక్ష పెట్టారు. శాక్యులకు మళ్లీ చిక్కు వచ్చింది. మళ్ళీ ఆలోచించారు. కోసలరాజు దూతలను ఏదో విధంగా మోసంచేసి పంపాలి అని నిశ్చయించుకొని వారు వ్యూహం పన్నారు.

ఆ రోజున మహానామ భోజనానికి కూర్చున్నాడు. కొంచెం ఎడంగా దూతలు కూర్చున్నారు. మహానాముడు ఒక దాసీని పిలిచి, "అమ్మాయిని తీసుకురా, నాతో పాటు భోజనం చేస్తుంది," అన్నాడు. నిమిషంలో వాసవ వచ్చి, తండ్రితోపాటు ఆయన కంచం ముందే కూర్చుంది. మహానాముడు ఒక ముద్ద నోటిలో పెట్టుకున్నాడు. వాసవక్షత్రియ కూడా ఆయన కంచంలో చెయ్యి పెట్టింది. రెండో ముద్ద తీయబోతున్నాడు.

ఇంతలో ఒక భటుడు వచ్చి ఒక ఉత్తరం చూపించి, "ప్రభూ! అవంతి రాజుగారు ఈ ఉత్తరం పంపారు. ఉన్నపాటున సమాధానం తెమ్మన్నారు," అని చెప్పాడు.

మహానాముడి కుడిచెయ్యి కంచంలోనే వుంది. ఎడం చేతితో ఉత్తరం తీసి చదువుతూ, "నువ్వు తింటూ వుండు అమ్మా," అన్నాడు. వాసవ తింటూవుంది. అతను అతి శ్రద్ధతో ఉత్తరం చదువుతూనేవున్నాడు. కూతురి భోజనం కాగానే, తండ్రీ కూతురూ లేచి చేతులు కడుక్కున్నారు.

కోసలరాజు దూతలు ఇందులో ఉన్న కిటుకు తెలుసుకోలేకపోయారు. వాసవ ఆ మహానాముడి స్వంత కూతురే అని

నమ్మారు. శాక్యులు చాలా సంతోషించారు. మహానాముడు ఎంతో వైభవంగా కుమార్తెను కోసలకు పంపించాడు.

కోసలరాజు సంతోషించి వాసవను పట్టపురాణిగా చేసుకొన్నాడు. కొన్నాళ్ళకు వాసవక్షత్రియ కొడుకును కన్నది. వానికి విరూఢవుడు అని పేరు పెట్టారు.

విరూఢవుడు పెరిగి పెద్దవాడయ్యాడు. ఒకనాడు తల్లి వద్దకు వెళ్ళి, "అమ్మా! పిల్లలందరూ వాళ్ళ తాతగారింటికి వెళ్ళుతున్నారు. నేనూ మా తాతగారింటికి వెళ్లి వస్తాను," అని సరదా పడ్డాడు. ఈ మాట వినేసరికి వాసవక్షత్రియకు నెత్తిన పిడుగు పడినట్టయింది. వద్దని ఎన్నో విధాల చెప్పి చూచింది. కాని, వద్దన్నకొద్దీ విరూఢవుడికి పట్టుదల ఎక్కువయింది.

చివరకు ఆమె కొడుకు ప్రయాణానికి ఒప్పుకుంటూ, రహస్యంగా తన తండ్రికి వక జాబు వ్రాసింది – "నీ మనమడు కపిలవస్తుకు వస్తున్నాడు. వాడికి ఈ రహస్యం తెలియనీయకుండా వుంచండి," అని.

విరూఢవుడు వస్తున్నాడని తెలియగానే నగరంలోని శాక్యులు వారి పిల్లలందరినీ దగ్గర దగ్గర పల్లెటూళ్ళకు పంపించివేశారు. ఎందుచేతనంటే, దాసీపుత్రుడైన




విరూఢవుడికి, శాక్యులెవ్వరూ నమస్కారం చేయరాదని వాళ్ళ పట్టుదల.

విరూఢవుడు కపిలవస్తు నగరం చేరుకొన్నాడు. అతనికి స్వాగతం ఇవ్వటానికి శాక్యులంతా సభ చేశారు. అక్కడ అందరినీ వరుసగా రాజకుమారునికి పరిచయం చేశారు. విరూఢవుడు ఒక్కొక్కరికే నమస్కరించాడు. కాని, శాక్యులలో ఒక్కరూ అతనికి తిరిగి నమస్కరించలేదు. విరూఢవుడికి యిదంతా ఆశ్చర్యంగానే వుంది. అతనికి శాక్యులు జాగ్రత్తగా విడిదీ, భోజనాలు ఏర్పాటు చేశారు.

కొన్నాళ్ళుండి, విరూఢవుడు మళ్ళీ తన నగరానికి బయలుదేరాడు. అతని

సైనికులలో ఒకడు విడిదిలో ఏదో వస్తువు మరచిపోయి, మళ్ళీ వెనక్కి వెళ్ళాడు. అక్కడ ఒక అద్భుతమైన దృశ్యం అతని కంటబడింది — విరూఢవుడు కూర్చుని వదలిన స్థలాన్ని ఒక దాసీది పాలతో కడిగి శుద్ధి చేస్తూ, గొణుగుతున్నది.

సైనికుడు ఆమె నుండి అసలు విషయం తెలుసుకొన్నాడు. ఈ మాట తోటి సైనికులతో చెప్పాడు. కల్లోలం ప్రారంభమయింది. పోయి పోయి, ఈ సంగతి విరూఢవుని చెవిని పడింది. అతనికి విపరీతమైన కోపం వచ్చింది. "నేను కూర్చున్న ఆ స్థలాన్ని పాలతో కడిగి శుద్ధి చేశారు శాక్యులు. ఇది చాలదు. నేను రాజునై, ఆ స్థలాన్ని శాక్యుల కంఠరక్తంతో శుద్ధి చేస్తాను. అప్పుడు కాని అది పవిత్రం కాదు...." అని ప్రతిజ్ఞచేశాడు.

విరూఢవుడు కోసలరాజ్యం చేరుకోగానే ఈ మాయ అంతా ప్రసేనజిత్తుకు తెలిసింది. అతనూ ఉగ్రుడయ్యాడు. కాని, తనకు గురుదేవుడైన బుద్ధభగవానునికి అపచారం చేసినట్టు అవుతుందనే వుద్దేశ్యంతో శాక్యులకు హాని చేయవద్దన్నాడు కొడుకుతో.

అయితే, విరూఢవుడు తండ్రికి ఎదురు తిరిగాడు. కోసలరాజ్య సింహాసనం అలంకరించాడు. తను రాజు కాగానే ముందు శాక్యకులాన్ని నాశనం చేయాలని సంకల్పించుకొన్నాడు. తల్లి ఐన వాసవక్షత్రియ కళ్ళనీళ్ళతో బతిమలాడింది వద్దని. కాని, అతని మనసు మారలేదు.

పెద్ద సైన్యంతో తరలివెళ్ళి, శాక్యులను ఎదిరించాడు. వారు ఈ దాడికి నిలవలేక పోయారు. ఏ కోశానా దయ, జాలి అనేది లేకుండా, విరూఢవుడు శాక్యులందరిని నరికివేసి, రక్తం ప్రవహింప జేశాడు.

ఆ నెత్తురుతో తను శాక్యరాజ్యంలో ఇదివరకు కూర్చున్న స్థలాన్ని కడిగివేశాడు. ఈ విధంగా విరూఢవుడు తన పగ తీర్చుకొన్నాడు. శాక్యకులం, శాక్యరాజ్యం సర్వనాశనమయినై.



# గుణపాఠం

సుబ్బయ్య అనే షావుకారు వద్ద ఊళ్ళో వాళ్ళెవరూ పని చేసేవాళ్ళు కారు. ఎందుకంటే ఏదో వంక పెట్టి, అతను పనివాడి జీతం ఎగగొట్టేవాడు.

ఒకసారి పొరుగూరి భీముడు సుబ్బయ్య వద్ద జీతానికి కుదిరాడు. తాను చెప్పినదంతా చెయ్యకపోతే జీతం ఇయ్యనని సుబ్బయ్య ముందే భీముడితో చెప్పాడు. సుబ్బయ్య చెప్పిన ప్రతి పనీ భీముడు చేశాడు. నెల గడిచింది. భీముడు జీతం అడిగాడు.

"ఈ ఒక్క పనీ చెయ్యి, జీతం ఇస్తాను," అంటూ సుబ్బయ్య రెండు గాజుగ్లాసులు భీముడికి ఇచ్చి, చిన్న గ్లాసులో పెద్దది పెట్టమన్నాడు. జీతం ఎగగొట్టే ఎత్తని భీముడు గ్రహించి, పెద్ద గ్లాసును చితకగొట్టి చిన్న గ్లాసులో ముక్కలన్నీ పోసి యజమానికి చూపి, జీతం ఇయ్యమన్నాడు.

సుబ్బయ్య జీతం ఇయ్యకపోగా, భీముణ్ణి పగిలిన గ్లాసు ఖరీదు ఇయ్యమన్నాడు. భీముడు న్యాయాధికారి వద్దకుపోయి సుబ్బయ్య మీద ఫిర్యాదు చేశాడు.

"నువ్వు పెద్ద గ్లాసును పగలగొట్టకుండా చిన్న గ్లాసులో పెట్టమనలేదు. నువ్వు చెప్పిన పని చెయ్యాలంటే భీముడు చేసినది తప్ప మరో మార్గం లేదు," అని న్యాయాధికారి భీముడికి జీతం ఇప్పించాడు.

—బి. సరోజ






ఆనందుడు ఏ బాధ్యతా లేకుండా గాలికి తిరుగుతూండడం చూసి ఒకనాడు తండ్రి నానా తిట్లూ తిట్టాడు. ఆ రాత్రే ఆనందుడు కొంత డబ్బు కాజేసి, ఇంటి నుంచి పారిపోయాడు. వాడు ఊళ్ళ వెంట తిరుగుతూ, కొంత కాలానికి కాశీపట్నం చేరుకున్నాడు.

కాశీపట్నం వింతలు చూస్తూ తిరుగుతూండగా, ఒక చోట బాట పక్కనే బిచాణా పరుచుకున్న మాంత్రికుడు ఒకడు కనిపించాడు. ఆనందుడు తనకేసి వింతగా చూడడం గమనించి ఆ మాంత్రికుడు, చిరునవ్వుతో పలకరించి, "బాబుగారు దక్షిణదేశం నుంచి వచ్చినట్టున్నారు. మంత్ర విద్యలు చూస్తారా?" అంటూ ఒక చిన్న విద్య చూపాడు.

ఆనందుడు ఆశ్చర్యపోయి, నోరు తెరిచి, కళ్లు వెళ్ళబెట్టాడు.

"తమరు నాకు అయిదు రూపాయలిచ్చినట్టయితే ఈ విద్య తమరికి చెప్పేస్తాను," అన్నాడు మాంత్రికుడు.

ఆనందుడికి ఆ విద్య నేర్చుకుంటే అందరూ తనను ప్రయోజకుడుగా గుర్తిస్తారనిపించింది. అతను మాంత్రికుడికి అయిదు రూపాయలిచ్చి ఆ కిటుకు తెలుసుకున్నాడు. ఇటువంటి విద్య చేతిలో ఉంటే, ఇతరులచేత పందెం కాయించి డబ్బు కూడా చేసుకోవచ్చునని ఆనందుడికి తోచింది.

అతను మర్నాడు అదే దారిన వస్తూ మాంత్రికుడు తన చుట్టూ చేరినవారికి మరో విద్య చేసి చూపుతూండడం చూశాడు. అందరూ వెళ్ళిపోయాక, ఆనందుడు మాంత్రికుడికి పది రూపాయలిచ్చి, ఈ కొత్త విద్య కూడా నేర్చుకున్నాడు.

ఎమ్. వి. వి. సత్యనారాయణ

ఇలా ఆనందుడు నూరు రూపాయల దాకా మాంత్రికుడికి ఇచ్చి కొన్ని విద్యలు నేర్చుకున్నాడు. ఇంతలో ఆనందుణ్ణి వాళ్ళ ఊరివాళ్ళు కొందరు పట్టుకుని, ఇంట్లో చెప్పకుండా వచ్చినందుకు మంద లించి, ఇంటికి తీసుకుపోయారు.

ఇల్లు చేరినాక ఆనందుడు, తాను అప్రయోజకుడు కాడని నిరూపించటానికి, తన సరంజామాతో రచ్చబండ వద్దకు చేరి, నలుగురినీ చేర్చి, తన విద్యలు చూపి, వాటిని ఇంకెవరన్నా చేస్తే యాభై రూపాయి లిస్తాననీ, ప్రయత్నించి ఓడిన వాళ్లు తనకు అయిదు రూపాయ లియ్యా లనీ అన్నాడు. ఒకరిద్దరు అతనిలాగా విద్యలు చెయ్యలేక అయిదేసి రూపాయ లిచ్చుకున్న తరవాత ఎవరూ ప్రయత్నించ లేదు. ఎప్పుడైనా ఇతర గ్రామాలవాళ్ళు వచ్చి అయిదేసి రూపాయలు పోగొట్టు కునేవారు.

అది చూసి ఆనందుడు, తాను చేసే విద్యలు చేసి చూపిన వారికి నూరు రూపాయలు బహుమానం యిస్తానని ప్రకటించాడు.

ఒకనాడు ఒక గడ్డం పెరిగిన తాత ఒకడు వచ్చి, ఆనందుడు చేసిన విద్య తాను కూడా చేసి, ఆనందుడి వద్ద నూరు రూపాయలు బహుమానం పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

తరవాత ఆనందుడు ఆ విద్య చెయ్యటం మానేసి, మరొక విద్య చేసి



జనానికి చూపుతూ, అలా చేసిన వారికి నూరు రూపాయ లిస్తాననీ, చేస్తానని వచ్చి చెయ్యలేనివారు తనకు అయిదు రూపాయ లియ్యాలనీ అన్నాడు. మరుసటి రోజున ఎవడో బిచ్చగాడు వచ్చి, ఆ విద్య చేసి నూరు రూపాయలూ గెలుచుకున్నాడు.

ఆనందుడికి ఏడుపు వచ్చింది. డబ్బు పోవటం అటుంచి, ఊళ్లోవాళ్ళ ముందు తన కీర్తి నీరు గారిపోతున్నది. అతను తప్ప చేయలేడనుకున్న విద్యలు ముసలి వాళ్ళూ, బిచ్చగాళ్ళూ సునాయాసంగా చేసేస్తున్నారు. అతను ఏ ప్రయోజనం కోరి, డబ్బుపోసి కాశీపట్నంలో ఈమంత్ర విద్యలు నేర్చుకున్నాడో ఆ ప్రయోజనానికే ప్రమాదం ఏర్పడింది.

ఆనందుడు లేచి, బిచ్చగాడి వెంట చాలా దూరం పోయి, ఊరి బయటవాణ్ణి కలుసుకుని, "చూడు, బాబూ! నువు ఈ విద్యను కాశీలో నేర్చుకున్నావా?" అని అడిగాడు.

"ఈ ముష్టి విద్యకు కాశీ వెళ్లాలా?" అని బిచ్చగాడు అడిగాడు.

ఆనందుడికి ఆ కంఠ ధ్వని గుర్తు వచ్చింది. తనకు కాశీలో విద్యలు నేర్పిన మాంత్రికుడే ఈ బిచ్చగాడు. నిన్నటి గడ్డంవాడు కూడా వీడేనేమో!

"ఎవరు నువు? నిజం చెప్పు!" అని ఆనందుడు వాడి కంఠం పట్టుకున్నాడు.

వాడు ఆనందుడి పట్టు విడిపించుకుని, "నేను కూటికి లేని స్థితిలో, ముష్టి ఎత్తుకునే సాధనంగా ఈ విద్యలు నేర్చుకున్నాను. కాని నీ వంటి ధనవంతుడికి ఈ విద్యలు ఎలా ఉపయోగపడతాయో చూడాలని, నీ వెనక నే వచ్చాను. నీ తండ్రి బోలెడంత సంపాదించి పెట్టాడు గనక, దానితో వ్యాపారం చేసుకుంటూ బతక్క, నీ కిదేం దుర్బుద్ధి?" అన్నాడు మాంత్రికుడు కోపంగా

ఆ మాటతో ఆనందుడికి బుద్ధి వచ్చి, వాడు తండ్రి వ్యాపారంలో తల దూర్చి, గౌరవంగా బతకటం నేర్చుకున్నాడు.



# కోతిపని

రామయ్యా అనే వైద్యుడి వద్ద దామోదరుడు అనే స్నేహితుడు వెయ్యిరూపాయలు చేబదులు పుచ్చుకుని, పత్రమూ, సాక్ష్యమూ లేనందున, రామయ్య డబ్బు అడిగితే తాను బాకీ లేనని బొంకాడు. రామయ్య ఈ సంగతి చెబితే, అతని భార్య, "ఆ డబ్బు తిరిగి వచ్చే పద్ధతి మీ ఇష్టదైవం హనుమంతుడు చూసుకుంటాడులే!" అన్నది.

రామయ్య తన డబ్బు మీద ఆశ వదులుకున్నాడని నిర్ధారణ చేసుకుని, దామోదరుడు వెయ్యిరూపాయలకు బంగారం కొని, నగలు చెయ్యమని గోవిందాచారికి ఇచ్చాడు. గోవిందాచారి బంగారం కాజేసి, ఇత్తడినగలు చేసి, బంగారు పూత పూసి దామోదరుడికి ఇచ్చాడు. త్వరలోనే దామోదరుడు మోసం గ్రహించి అడిగితే, "ఈ నగలు నేను చేసినవి కావు," అన్నాడు గోవిందాచారి.

ఆ డబ్బుతో ముత్యాలు స్థలం పదిహేనువందలకు బేరం చేసి, గోవిందాచారి వెయ్యి రూపాయలు ముందే ఇచ్చేశాడు. అతను రెండు వారాల అవతల మిగతా అయిదువందలూ ఇయ్యబోతే, "స్థలం ఖరీదు రెండున్నరవేలు అని చెప్పానే?" అన్నాడు ముత్యాలు.

ముత్యాలు వడ్డీ వ్యాపారం చేస్తాడు. విశ్వనాథుడు అనేవాడు అతని దగ్గిర వెయ్యి రూపాయలు అప్పు పుచ్చుకుని, ఆ రాత్రే ఊరూ, దేశమూ వదిలిపోతూ, దొంగలకు చిక్కి డబ్బంతా పోగొట్టుకున్నాడు.

దొంగలు అడవిలో ఒక మర్రిచెట్టు తొర్రలో ఆ డబ్బు దాచారు. వైద్యుడు రామయ్య మూలికల కోసం ఆ ప్రాంతంలో వెతుకుతూ ఉండగా, ఒక కోతి మర్రిచెట్టు తొర్రలో నుంచి డబ్బు మూట తీసి, అందులో ఆహారం ఏమీలేదని తెలిసి, రామయ్య సమీపంలో పడేసింది.

ఆ మూటలో రామయ్యకు వెయ్యిన్నూటపదహార్లు దొరికాయి.





# భూతవైద్యం

కొత్తపేటలో కాంతయ్య అనే అమాయకుడు ఉండేవాడు. అతను పల్లె పల్లెకూ తిరిగి తినుబండారాలు అమ్ముకుంటూ జీవించేవాడు.

కొత్తపేటకు పొరుగున ఉన్న పాతపేటలో చలపతి అనే మోసగాడు ఉండేవాడు. వాడు పెద్దమనిషిగా చలామణీ అయి, కబుర్లు చెబుతూ గ్రామాలన్నీ తిరుగుతూ, వీలుచిక్కినప్పుడల్లా ఎవరినో ఒకరిని మోసం చేస్తూండేవాడు.

ఒక రోజు కాంతయ్య కొత్త గొడుగు కొనటం వాడు చూశాడు. మర్నాడు చినుకులు పడుతూండగా వాడు కాంతయ్య ఇంటికి వచ్చి, మళ్లీ ఇస్తానని ఆ గొడుగు తీసుకుపోయి, తిరిగి ఇయ్యలేదు.

పదిరోజుల తరవాత చలపతి ఒంటరిగా కనిపించేసరికి, కాంతయ్య, ''నా గొడుగు ఏదీ ?'' అని అడిగాడు.

కాంతయ్యకు దయ్యాలుంటాయని నమ్మకమే గాక, అవి అంటే చచ్చే భయం కూడానూ. ఈ సంగతి చలపతికి తెలుసు.

''ఆ రోజు నీ దగ్గిర గొడుగు తీసుకున్నానన్న మాటేగాని, దొప్పదోగుతూ ఇంటికి తడిసి వెళ్ళాను, కాంతయ్యా. ఏం జరిగిందంటే, ఊరి బయట మర్రిచెట్టు లేదూ, అక్కడ ఒక దయ్యం నా ముందు దూకి, గొడుగు లాగేసుకున్నది. 'ఈ గొడుగు కాంతయ్యది. దీన్ని నువు తీసుకుంటే వాడు ఊరుకోడు !' అన్నాను. 'వాడు నిన్ను ఏదైనా అంటే ఆ మాట ఈ చెట్టు తొర్రలో ఊదిపో. మిగిలినది నేను చూసుకుంటాను !' అని దయ్యం చెట్టు మీదికి ఎగిరిపోయింది. ఆ భయంతో నేను వారం రోజులు మంచం పట్టానంటే నమ్ము. ఇప్పుడిప్పుడే బయట తిరుగు

కలువకొలను సదానంద

తున్నాను. నన్ను ఏం చెయ్యమంటావో చెప్పు!'' అన్నాడు చలపతి.

దయ్యం అనగానే గుండె జారిపోయి, ''దయ్యం లాక్కుంటే నేను మాత్రం ఏం చేసేవాణ్ణి?'' అన్నాడు కాంతయ్య.

కొత్తపేటలో భద్రయ్య అనే భూత వైద్యుడున్నాడు. కాంతయ్య మాటల సందర్భంలో భద్రయ్యతో, తన గొడుగును దయ్యం కాజేసినమాట చెప్పాడు.

''మనుషులకు దయ్యం పట్టితే వదల గొట్టగలను గాని, నీ గొడుగును ఎలా తెచ్చి ఇయ్యగలను? ఏమైనా, మర్రి చెట్టులో దయ్యం ఉన్నమాటే నిజమైతే, ఎప్పుడో ఒకప్పుడు దాని భరతం పట్ట కుండా ఉండను,'' అన్నాడు భద్రయ్య.

చలపతి అంటే భద్రయ్యకు చాలా కోపంగా ఉన్నది. ఎందుకంటే, దయ్యాలూ, భూతాలూ లేవనీ, భద్రయ్య లోకులను మోసపుచ్చుతున్నాడనీ చలపతి అక్కడక్కడా అన్నట్టు భద్రయ్య విని ఉన్నాడు. అవకాశం దొరికితే చలపతికి శాస్తి చెయ్యాలని భద్రయ్య ఉద్దేశం.

మరోవారం రోజుల తరవాత, మిట్ట మధ్యాన్నం వేళ, కాంతయ్య తిను బండారాలు అమ్ముకుంటూ, ఒక పల్లె నుంచి మరొక పల్లెకు నడిచిపోతుండగా, ఒక మలుపులో హఠాత్తుగా అతనికి



చలపతి ఎదురుపడ్డాడు. అతని చేతిలో గొడుగు ఉన్నది. అది కాంతయ్య గొడుగే!

కాంతయ్య ఆగి, ''ఇది నా గొడుగే కదూ?'' అన్నాడు.

''ఔను, నీదే.'' అన్నాడు చలపతి.

''మరి, దయ్యం లాక్కుపోయిందంటి విగా?'' అన్నాడు కాంతయ్య.

చలపతి అతని కేసి గుడ్లు ఉరుముతూ చూసి, ''నేను ఎవరనుకుంటున్నావు? చలపతి నుంచి గొడుగు లాక్కున్న దయ్యాన్ని!'' అని ముందుకు నడిచాడు.

కాంతయ్య వణికిపోతూ, కాలి సత్తువ కొద్దీ పరుగు అందుకున్నాడు. కొద్ది దూరం పోయాడో లేదో, అతను భద్రయ్యను ఢీ

కొన్నాడు. భద్రయ్య ఎక్కడో మంత్రాలు చదివి వస్తున్నాడు.

"ఏమిటి అలా వణికిపోతున్నావు?" అని భద్రయ్య కాంతయ్యను అడిగాడు.

"భద్రయ్యగారూ, ఆ గొడుగు పట్టుకు పోతున్నది ఎవరనుకున్నారు? చలపతి కాదు, దయ్యం! ఆ మాట అదే చెప్పింది." అన్నాడు కాంతయ్య వగర్చుతూ.

"అదా సంగతి?" అంటూ భద్రయ్య మంచి వేపబెత్తం విరుచుకుని, "ఏయ్, పిశాచీ! అక్కడే ఆగు!" అని కేకవేసి, చలపతి కేసి పరిగెత్తాడు.

చలపతి వెనక్కు తిరిగి చూసి, ప్రమాదం గ్రహించి, పరిగెత్తసాగాడు.

"అది దయ్యం! పట్టుకోండి! పారిపో నియ్యకండి!" అంటూ భద్రయ్య కేకలు పెట్టేసరికి, పొలాల్లో వున్న మనుషులు వచ్చి, చలపతిని పట్టుకున్నారు.

ఇంతలో భద్రయ్య వచ్చి, చలపతిని బెత్తంతో బాదుతూ, "భద్రయ్య దయ్యాలను ఏం చేస్తాడో తెలుసా? ఏ చెట్టు తొర్రలోనో పడి ఉండక, నీకు గొడుగు కావలిసి వచ్చిందా?" అన్నాడు.

చలపతి కాంతయ్యకు గొడుగు ఇచ్చేస్తూ, "నేను దయ్యాన్ని కాదు బాబో! చలపతినే! నన్ను వదిలిపెట్టండి!" అని లబలబలాడాడు.

"ఏదిదయ్యమో, ఎవరు మనిషో నాకు నువు చెబుతావా? నీ వేషాలు నా దగ్గిరనా! నిన్ను మారణహోమం చేస్తాను. హ్రాం! హ్రీం! ఫట్!" అంటూ చలపతిని చావబాది, వదిలిపెట్టాడు భద్రయ్య.

'బ్రతుకు జీవుడా!' అని చలపతి, తిరిగి చూడకుండా పారిపోయాడు.

"ఇక పోదాం పద, కాంతయ్యా! ఆ దయ్యం మళ్ళీ ఈ జన్మలో నీ జోలికి రాదు!" అన్నాడు భద్రయ్య.

తాను దయ్యం దగ్గిరనుంచి భద్రయ్య సహాయంతో గొడుగు ఎలా సంపాదించు కున్నదీ చలపతికి చెబుదామని కాంతయ్య అనుకున్నాడు. కాని అతనికి మళ్ళీ చలపతి కనిపించనేలేదు.






యుధాజిత్తు చెప్పిన దానికి కాశీరాజు ఏమీ అనలేని స్థితిలో తల వంచుకుని, అంతఃపురానికి వెళ్ళి, తన భార్యతో, "మన అమ్మాయి ఆ సుదర్శనుణ్ణి తప్ప మరెవరినైనా వరిస్తేగాని మన మానం దక్కదు," అన్నాడు.

రాణి తన కుమార్తె వద్దకు వెళ్ళి, "అమ్మా, నిన్ను పెళ్ళాడాలని అంతమంది రాజులు వచ్చి ఉండగా, సుదర్శనుణ్ణే పెళ్ళాడతానని పట్టుబట్టి, మన ప్రాణాల మీదికి ఎందుకు తెస్తావు? స్వయంవర సభకు పద. నువు సుదర్శనుణ్ణే వరిస్తానంటే, యుధాజిత్తు ఆ సుదర్శనుడితో పాటు నిన్నూ, నన్నూ, నీ తండ్రినీ కూడా చంపేస్తాడు. అతను అమిత క్రూరుడు!" అని నయానా, భయానా హెచ్చరించింది. అదే సమయంలో తండ్రి కూడా వచ్చి శశికళకు ఎన్నో విధాల చెప్పాడు.

ఎన్ని చెప్పినా, శశికళ ఆత్మహత్య చేసుకుంటానుగాని, మరొకరిని పెళ్ళాడనన్నది. ఆమె తండ్రితో, "నీకు ఈ రాజులంటే భయం అయితే నన్ను సుదర్శనుడికిచ్చి, రథంలో మమ్మల్ని పొలిమేర దాటించు. యుద్ధం జరిగితే అతను శత్రువులను తానే చంపేస్తాడు," అన్నది.

"చూడు, తల్లీ! అనేకమందితో విరోధం తెచ్చుకోవటం ఎవరి తరమూ కాదు. మొండి పట్టు పట్టకు. అన్ని పనులలోనూ సాహసం కూడదు. మిమ్మల్ని పొలిమేర బయట వదలినంత

## 10. సుదర్శనుడి రాజ్యప్రాప్తి



మాత్రాన ఆ దుర్మార్గులు మిమ్మల్ని చుట్టుముట్టితే మీరు చెయ్యగలిగినదేమున్నది? నా కొక పద్ధతి తోస్తున్నది. సీత పెళ్ళికి పెట్టినట్టుగా నీ పెళ్ళికి ఒక పరీక్ష పెట్టుతాను. అందులో నెగ్గినవాణ్ణి పెళ్ళాడు," అన్నాడు సుబాహుడు.

"అందువల్ల సమస్య తీరుతుందా? పందెంలో ఎవడో గెలిచి నన్ను పెళ్లాడతాడు. అప్పుడు మిగిలినవాళ్లు ఊరుకుంటారా? ఎలాగూ యుద్ధం తప్పదు. మహాదేవిని నమ్ముకుని నన్ను సుదర్శనుడి కిచ్చి పెళ్ళి చెయ్యి," అన్నది శశికళ.

ఆమె నిర్ణయించిన పథకాన్ని ఆమోదించి సుబాహుడు సభకు తిరిగివచ్చి, "మహారాజులారా! ఈ రోజుకు సభ చాలింతాం. రేపు మీకు నచ్చిన విధంగా స్వయంవరం జరుగుతుంది. ఇవాళకు మీరు మీ మీ విడుదలకు దయ చెయ్యండి," అన్నాడు.

రాజులు తమ తమ శిబిరాలకు తిరిగి పోయి, నగరం నాలుగు పక్కలా సేనలను కాపలా ఉంచారు.

సుబాహుడు రహస్యంగా వివాహ ప్రయత్నాలు జరిపించి, సుదర్శనుణ్ణి రప్పించి, తన కూతుర్ని అతనికి శాస్త్రోక్తంగా కన్యాదానం చేశాడు. ఆ సందర్భంలో ఆయన తన అల్లుడికి రెండు వందల రథాలూ, కొన్ని వేల గుర్రాలూ, కొన్ని వందల మంది దాసీలూ, ఇతర కానుకలూ ఇచ్చాడు. అతను మనోరమతో, "అమ్మా, ఇక నా కూతురు నీ కొడుకు సొత్తు, నీ సొత్తు. దాన్ని ప్రేమగా చూసుకో," అని నమస్కారం చేశాడు.

మనోరమ ఎంతో సంతోషంతో, "అయ్యా, మహారాజువై ఉండి కూడా, రాజ్యహీనుడైన నా కొడుక్కు నీ కూతుర్ని పెళ్లి చేశావు! నీవంటి ఉత్తముడు ఎక్కడా ఉండడు. నీ కుమార్తె భారం మాది అయితే, మా భారం నీది!" అన్నది.

దానికి సుబాహుడు, "అమ్మా, నీ కొడుకు రాజ్య విహీనుడని ఎందుకు

అనుకోవాలి? నా రాజ్యం అతనిది కాదా? నా సేన అంతా ఇస్తాను. మనం నీరక్షీర న్యాయంగా ఉండేటప్పుడు ఒకడు రాజనీ, ఇంకొకడు సేవకుడనీ విచక్షణ దేనికి? ఇతర రాజులున్న మాట నిజమే. వారిని సామదానభేదాలతో అదుపులో పెట్టుతాను. అలాగూ దారికి రారూ, యుద్ధం చెయ్యటానికి నేను సిద్ధమే! జగదంబ అండ ఉండగా విచారం దేనికి?" అన్నాడు.

"ఎంత చల్లని మాట అన్నావు, బాబూ! నీకు శుభం కలుగుతుంది. నీ రాజ్యాన్ని నువూ, నీ కొడుకులూ సుఖంగా ఏలుకోండి. జగన్మాత అనుగ్రహంతో నాకొడుకు తన తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించుకుంటాడు. గ్రహచారం సరిగా ఉన్నవాడు మట్టి పట్టుకుంటే బంగారమవుతుంది. ఏది చేసినా కలిసివస్తుంది. అందరూ సహాయపడతారు. ఇప్పుడు నా కొడుకు అదృష్టం బాగున్నది. వాడి రోజులు మంచివి. కీడురాదు," అన్నది మనోరమ.

ఈలోపల విడుదులలో ఉన్న రాజులకు మంగళవాద్యాల సవ్వడి వినిపించింది. "ఈ మంగళ వాద్యా లేమిటి?"

"ఇవి పెళ్లి వాద్యాలలాగున్నాయే!"

"ఈ రాజు మన అందరి కళ్ళలోనూ దుమ్ము చల్లి, కూతుర్ని వాడి కిచ్చి పెళ్లి



చెయ్యటం లేదు గదా!" అని వాళ్ళలో వాళ్ళు అనుకుంటూండగా, సుబాహుడు వచ్చి, "మహారాజులారా, పెళ్లివిందుకు తమరందరూ దయచెయ్యండి," అని ఆహ్వానించాడు.

ఈ వార్తను రాజులు ఆదరంతో వినలేదు. కాశీరాజు వారితో, "నేనేం చేసేది? నా కూతురు ఎన్నివిధాల చెప్పినా వినక, ఆ సుదర్శనుణ్ణే పెళ్లాడింది. మీరు నన్ను అనుగ్రహించి, విందులో పాల్గొని నా పరువు దక్కించండి," అన్నాడు.

"రాజా, మా భోజనాలు అయిపోయాయి. ఇప్పుడు ఎవరూ రారు. అర్ధరాత్రి పెళ్లితో అలసిపోయి ఉంటావు.



భోజనం దేమున్నదిలే! నువ్వు వెళ్లు! మేమూ పోతాం!'' అన్నారు రాజులు.

సుబాహుడు వారిని గురించి అనుమానంతో తన భవనానికి తిరిగి వెళ్ళాడు.

అతను వెళ్ళగానే రాజులలో కొందరు సుదర్శనుణ్ణి చంపి, రాజకుమార్తెను సంగ్రహించుదామన్నారు. అది అన్యాయం; పెళ్లి సంబరం చూసి, మన దారిన మనం పోదామన్నారు, మరికొందరు. మిగిలిన వాళ్ళు రకరకాలుగా మాట్లాడారు.

ఈ లోపల సుబాహుడు పెళ్లితంతు పూర్తిచేసి, తన కూతురికి, అల్లుడికి అప్పగింతలూ, అంపకాలూ జరుపుతూండగా, కొందరు వచ్చి, ''రాజా, వధూవరులను ఇప్పుడు పంపకు. దారిలో శత్రువులు రాక్షసులలాగా కాపువేసి ఉన్నారు.'' అని చెప్పారు.

రాజుల సంగతి ఎరిగినవాడు కావటం చేత సుబాహువు ఆ మాటనమ్మి, అంపకాలు చెయ్యటానికి సంశయించాడు.

అప్పుడు సుదర్శనుడు అతనితో, ''రాజా, నువేమీ సంకోచించవద్దు. దేవి నా పక్షాన ఉండగా ఈ రాజులు నన్నేం చెయ్యగలరు? మేం మా ఆశ్రమంలో సుఖంగా ఉంటాం! ఆశ్రమంలో కాపరం ఏమిటనుకోవద్దు. ఆ ప్రకృతి సౌందర్యం ముందు మీ నగరాలు ఎందుకూ పనికిరావు.'' అన్నాడు.

కాశీరాజు తన అల్లుడికి అంతులేని ధనం ఇచ్చి సాగనంపుతూ, సైన్యంతో సహా తాను కూడా తోడు బయలుదేరాడు.

దారులు కాచిఉన్న రాజులు దూరం నుంచి చూసి, ''అదుగో రథం! వాడే సుదర్శనుడు! పెళ్ళాంతోసహా పోతున్నాడు. పట్టుకుని కొట్టుదాంపట్టండి!'' అంటూ విజృంభించారు.

సుబాహుడు వారికి అడ్డు పడ్డాడు. సుదర్శనుడు మంత్రం జపిస్తూ, అంబను ధ్యానించాడు. ఆ సమయంలో శత్రుజిత్తూ, యుధాజిత్తూ అతని పైకివచ్చారు. సుబాహుడు వీరావేశంతో శంఖంపూరించి,

యుధాజిత్తు మీద వరసగా బాణాలు వేశాడు. ఇద్దరికీ తీవ్రంగా యుద్ధం సాగింది.

అంతలో జగదంబ దివ్యమైన ఆకారంతో, అనేక మహాయుధాలతో, పూల మాలలతో, సింహం మీద ప్రత్యక్షమయింది. సుదర్శనుడు ఆనందంతో శరీరం పులకరిస్తూండగా దేవిని తన మామకు చూపి, "ఇంక మనకు భయమేమిటి?" అని చెప్పి, రథం దిగి, తన భార్యనూ, మామనూ వెంట బెట్టుకుని, దేవి కాళ్ళకు ప్రణామం చేశాడు.

ఏనుగులు సింహాన్ని చూసి భయపడి ఘీంకారాలు చేస్తే, సింహం వాటిని చూసి గర్జించింది. అదేసమయంలో దారుణంగా గాలివీచి, భీభత్సం చెలరేగింది. రాజులందరికీ కంపరం పుట్టింది. వాళ్లు దిక్కు తెలియనట్టుగా నిశ్చేష్టులై చూడసాగారు.

అప్పుడు సుదర్శనుడు సేనాపతితో, "మహాదేవి మనకు అండగా వచ్చింది. నువు సంశయించక, రాజుల మీదికి సేనలు నడిపించు." అన్నాడు.

కాశీరాజు సేనలు రాజుల పైకి విజృంభించాయి.

అప్పుడు, తెల్లబోయి చూస్తున్న రాజులతో యుధాజిత్తు, "ఎవరో ఆడది సింహం మీద వచ్చేసరికి మీకు మతులు పోయాయేమిటి? ఒక అర్భకుడు ఒక ఆడదాన్ని




తోడు తెచ్చుకుంటే ఇందరు రాజులూ కొయ్యబారిపోతారా? క్షణంలో వాణ్ణి చంపి, రాజు కూతుర్ని వశపరుచుకుందాం పట్టండి!" అని, తన మనమడైన శత్రుజిత్తును వెంటబెట్టుకుని, సుదర్శనుడి మీద యుద్ధం సాగించాడు.

అప్పుడు అంబ అందరి రాజులకూ అన్ని రూపాలలో కనబడి, అందరితోనూ ఒక్కసారే యుద్ధం చేసింది. క్షణంలో యుధాజిత్తూ, శత్రుజిత్తూ బాణాలు తగిలి చచ్చారు. అందరూ నిర్ఘాంతపోయారు. సుబాహుడు ఆనంద బాష్పాలు రాల్చుతూ, ఆ పరాశక్తిని స్తోత్రం చేశాడు. తరవాత అతను ఆమెతో, "తల్లీ, నీ దర్శనంతో



ధన్యుణ్ణి అయాను. శాశ్వతంగా నా హృదయంలోనే నిలిచిపో! ఈ కాశిలోనే ఉండిపో. నాకు మరెవరి అండా అవసరం లేదు. భూమి ఉన్నంత కాలమూ ఈ కాశీ ఉంటుందంటారు. కాశీ ఉన్నంత కాలమూ నువు ఇక్కడే ఉండి, మాకు శత్రుభయం లేకుండా చెయ్యి. ఇదే నేను నిన్ను కోరే వరం,'' అన్నాడు.

మహాదేవి అందుకు ఒప్పుకున్నది.

తరవాత సుదర్శనుడు మహాదేవిని స్తోత్రం చేశాడు. అతను అమెను, ''తల్లీ, ఇప్పుడు నా కర్తవ్యం ఏమిటి? నే నెక్కడికి పోవాలి? నేను స్వయంగా అసమర్థుడనైనప్పటికీ, నీ అండ ఉంటే ఏమైనా సాధించగలను. అందుచేత నా కర్తవ్యం తెలిపి, నన్ను అనుగ్రహించు,'' అని వేడుకున్నాడు.

దానికి దేవి, ''ఇంక చేసేదేమున్నది? నీ భార్యతో సహా అయోధ్యకు వెళ్లి, సింహాసనం ఎక్కు; తగిన విధంగా రాజ్యం చేసుకో. నిన్ను నేను పైనుంచి కాపాడుతూ ఉంటాను ప్రతి అష్టమి, నవమి, చతుర్దశికీ నన్ను పూజ చెయ్యి. నాకు శరత్కాలం ఇష్టం. నవరాత్రి పూజలు చెయ్యి. మాఖ, చైత్ర, అశ్వయుజ, అషాఢ మాసాలు నాకు ఉత్సవాలు జరిపించు," అని హెచ్చరించి అదృశ్యమయింది.

తరవాత రాజులు ఒక్కరొక్కరే వచ్చి, ఇంద్రుడికి దేవతలు మొక్కిన విధంగా సుదర్శనుడికి మొక్కి, అంబను స్తుతించారు. వాళ్ళు అతన్ని తమ చక్రవర్తిగా ఆమోదిస్తూ, ''మహాత్మా, నువు అయోధ్యలో ఉండి మమ్మల్నందరినీ పాలిస్తూ, మా అపచారాలన్నీ మన్నించి, మాకు అజ్ఞలిస్తూ రాజ్యం చెయ్యి. నీ అనుగ్రహం చేతగదా మేం జగదంబను కళ్లారా చూడగలిగాం,'' అన్నారు.

తరవాత రాజులందరూ ఎవరి దేశాలకు వారు వెళ్లిపోయారు. కాశీరాజు తన అల్లుడికీ, కూతురికీ వీడ్కోలు చెప్పాడు.

సుదర్శనుడు అయోధ్యకు చేరేలోపునే వార్తలు చేరాయి. అందుచేత మంత్రులు మంగళ వాద్యాలతో సహా ఎదురువచ్చి, సుదర్శనుణ్ణీ, అతని భార్యనూ నగరంలోకి తీసుకుపోయారు.

సుదర్శనుడు తన సవతి తల్లి వద్దకు పోయి, కొడుకు చచ్చి ఏడుస్తున్న లీలావతికి నమస్కరించి, ఓదార్చి, "అమ్మా, నీ తండ్రినీ, నీ కొడుకునూ చంపినది నేను కాదు, మహాశక్తి! నీపాదాల సాక్షిగా చెబుతున్నాను. ఎవరో చేసిన కర్మకు నువ్వెందుకు బాధపడాలి? నన్ను నీకొడుకులాగే చూసుకో. మనోరమ కన్న నాకు ఎక్కువకా. నేను ఎలాటి భేదబుద్ధి చూపను. నీకు ఎల్లప్పుడూ మాతృసేవలు చేస్తాను. నేను పసివాణ్ణి అయి ఉండగా నీ తండ్రి దురుద్దేశంతో నన్ను రాజ్యభ్రష్టుణ్ణిచేస్తే, అది నా ప్రారబ్ధం అనుకున్నాను గాని, దుఃఖించలేదు. నీ తండ్రి నా తాతను చంపేస్తే, నా తల్లి పుట్టెడు దుఃఖంతో నన్ను తీసుకుని అడవి దారిన పోతుంటే, మమ్మల్ని దొంగలు దోచారు. తరవాత గంగాతీరాన ఋష్యాశ్రమంలో తల దాచుకున్నాం. వాళ్ళ అనుగ్రహం వల్ల ఇవాళ ఈ స్థితికి వచ్చాం. ఇప్పటికి కూడా నాకు ఎవరి మీదా ద్వేషం లేదు" అన్నాడు.

అతని మాటలు విని లీలావతి సిగ్గుపడుతూ, "నేను వద్దంటున్నా వినకుండా నా తండ్రి నీకు ద్రోహంచేసి, తాను చావటమేగాక, నా కొడుకును కూడా చంపాడు. నీ తల్లి నా అక్క. నువు నా కొడుకువు! నేను విచారించవలసిన పనేమిటి? నా వాళ్ళు చావటానికి కారణం నువు కాదని నాకు తెలియదా?" అన్నది.

తరవాత సుదర్శనుడు తన మంత్రుల చేత ఒక బంగారు సింహాసనం తయారు చేయించి, దాని మీద జగదంబను యథావిధిగా స్థాపించి, రోజూ పూజిస్తూ ఉండమని హెచ్చరించి, తాను పట్టాభిషేకం చేసుకుని, సుఖంగా చాలా కాలం రాజ్యం చేశాడు.






జనప్రియ మహారాజుకు, శ్రద్ధగా పని చేసే రాజోద్యోగు లందరినీ ప్రత్యేకంగా సన్మానించాలని కోరిక పుట్టింది. అందు కని ఆయన ఇద్దరు మంత్రులను నియ మించాడు. వారు విడి విడిగా ప్రతి రాజోద్యోగినీ గమనించి, తమ అభి ప్రాయాన్ని రాజుకు తెలియచేయాలి. ఇద్దరి దృష్టిలోనూ మంచి పని వాళ్లుగా ఉన్న వారికి రాజు ఒక మాసపు జీతం బహుమానంగా ఇయ్యాలని నిర్ణయించు కున్నాడు.

ఒక మాసం పాటు మంత్రు లిద్దరూ విడివిడిగా రాజోద్యోగులను గమనించి, వారిని గురించి తమ అభిప్రాయాలు విడి విడిగానే రాజుకు సమర్పించారు. రాజు వివరాలన్నిటినీ శ్రద్ధగా చదివాడు.

రాజోద్యోగులు మొత్తం రెండు వందల మంది. గోవింద మంత్రి దృష్టిలో పని శ్రద్ధగలవారు యాభైమంది మాత్రమే. కాని ఈశ్వర మంత్రి దృష్టిలో నూట యాభైమంది. ఇద్దరి దృష్టిలోనూ పనిశ్రద్ధ గలవారు అయిదుగురు మాత్రమే.

జనప్రియ మహారాజు ఎంతో సంతోషించి, ఆ అయిదుగురికీ అదనంగా ఒక నెల జీతం బహూకరించాడు.

ఇలా జరిగేసరికి మిగిలిన రాజోద్యోగులు ఉద్యోగుల పనిశ్రద్ధను మహారాజుగారు ఏ విధంగా నిర్ణయించినదీ తెలుసుకోవాలని పట్టుబట్టారు.

జనప్రియరాజు వారితో, ''ఉద్యోగుల పనిశ్రద్ధ నిర్ణయించటానికి ఇద్దరిని నియమించాను. ఇద్దరూ ఏకగ్రీవంగా పని శ్రద్ధ గలవారని నిర్ణయించిన అయిదుగురికీ బహుమానం ఇచ్చాను,'' అన్నాడు వారితో.

"అయితే, మిగతా నూట తొంభై అయిదు మందికీ పనిశ్రద్ధ లేదని వారు

"వసుంధర"

ఏకగ్రీవంగా నిర్ణయించారా?'' అని ఉద్యోగులు రాజును అడిగారు.

''లేదు. ఒక మంత్రి కొందరినీ, ఇంకో మంత్రి మరి కొందరినీ ఎన్నిక చేశారు. ఇద్దరూ ఎన్నిక చేసిన వారికే బహుమానం ఇచ్చాను,'' అన్నాడు రాజు.

''ఇది అన్యాయం!'' అన్నాడొక ఉద్యోగి.

''ఒక మంత్రి మెచ్చుకుని, ఇంకో మంత్రి మెచ్చుకోకపోతే లోపం మీదే,'' అన్నాడు జనప్రియుడు.

అందరూ అసంతృప్తిగా వెళ్లిపోయారు.

ఆ మర్నాడే చిరంజీవి దేశాటన చేస్తూ ఆ నగరానికి వచ్చాడు. చిరంజీవి మహా జ్ఞాని అని విని, జనప్రియ మహారాజు, అతన్ని ప్రత్యేకంగా రాజభవనానికి ఆహ్వానించి, అతిథి సత్కారాలు చేశాడు. అయన చిరంజీవితో కథ అంతా చెప్పి, ''ఒక మనిషి మీద ఇద్దరు మనుషులను నిఘా వేసి అభిప్రాయం చెప్పమంటే, ఇద్దరూ చెరొక రకంగా చెప్పినప్పుడు ఏ అభిప్రాయాన్ని స్వీకరించాలి?'' అని చిరంజీవిని అడిగాడు.

చిరంజీవి నవ్వి, ''నిఘా వేసిన ఆ ఇద్దరిలోనూ ఒకడు శిక్షార్హుడని నా అనుమానం,'' అన్నాడు.

రాజు, చిరంజీవి ఉద్దేశం సబబు అనిపించి, విచారణ జరిపేసరికి, ఈశ్వర మంత్రి ముందుగానే రాజోద్యోగులను హెచ్చరించి, లంచాలు స్వీకరించి, లంచాలిచ్చిన వారి పేర్లనుమటుకే తన నివేదికలో ఎన్నిక చేశాడని తెలిసింది. ఈశ్వర మంత్రికి లంచమిచ్చిన వాళ్ళు రాజుతో ఆ మాట చెప్పడానికి భయపడ్డారు. తమపై గోవిందమంత్రి నిఘా ఉన్న సంగతి వారెరగరు.

ఇంత చిన్న విషయం తనకు తట్టనందుకు విచారిస్తూ, రాజు గోవిందమంత్రి మెచ్చుకున్న నలభై అయిదు మందికీ బహుమానం ఇచ్చి, ఈశ్వర మంత్రినీ, లంచమిచ్చిన వారినీ శిక్షించి, చిరంజీవిని ఘనంగా సన్మానించాడు.





# మార్పు

అమరావతిని పాలించే శివసేనుడు ఒక రోజు రాజభవనం పై భాగంనుండి కిందికి చూస్తూ, వీధిన పోయే బిచ్చగాళ్ళను చూసి జాలిపడి, తన రాజ్యంలో బిచ్చగాడన్నవాడు లేకుండా చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. అందరూ భూస్వాములు కానవసరంలేదు; కాని దేశంలో కడుపుకు ఇంత తిండీ, ఒంటికింత బట్టా లేని మనుషులు ఉండటమేమిటి?

ఇందుకుగాను దేశంలో పెద్ద మార్పు రావాలనీ, ఆ మార్పుకు తగిన పథకం ఆలోచించమనీ శివసేనుడు తన మంత్రిని అడిగాడు.

మంత్రి కొంచెం ఆలోచించి, ''మీ ఆలోచన మంచిదే, కాని దారిద్ర్యం బిచ్చగాళ్ళను సృష్టిస్తుంది; ఆ దారిద్ర్యానికి మూల కారణాలు ఏవో ఆలోచించాలి. అంతేగాని దారిద్ర్యం మూలంగా బిచ్చగాడైన ప్రతివాడికీ ధన సహాయం చేస్తూపోతే, అది బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది,'' అన్నాడు.

"దారిద్ర్యానికి మూలకారణం ఏదైనా దారిద్ర్యం సహించరానిదే! దాన్ని తొలగించటంవల్ల ఎప్పుడూ మేలే జరుగుతుంది,'' అన్నాడు రాజు పట్టుదలగా.

''మహారాజా, డబ్బు ఏ సమస్యనూ పరిష్కరించదు. ధనంవల్ల బాగుపడేవాళ్ళూ ఉన్నారు, చెడిపోయేవాళ్ళూ ఉన్నారు. ఒక్క దరిద్రులలోనే కాదు, ధనికులలో కూడా ధనంతో చెడిపోయేవారు అనేకమంది ఉన్నారు,'' అన్నాడు మంత్రి.

"ఆ మాట దరిద్రులకూ, బిచ్చగాళ్లకూ వర్తించదు. కొద్దిమంది దరిద్రులకు ధన సహాయం చేసి, వారు బాగుపడతారో, లేదో చూతాం,'' అన్నాడు రాజు.

వేమూరి వెంకయ్య



ఆ రాత్రి రాజూ, మంత్రీ మారువేషాలు వేసుకుని, నగరం వెలపల ఉన్న సత్రానికి వెళ్ళారు. అక్కడ నలుగురు పేద వాళ్ళు కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ కనిపించారు.

రాజూ, మంత్రీ వారికి సమీపంగా వెళ్ళి కూర్చుని, మర్యాదగా పలకరించి, వారి కథలు అడిగారు.

వారిలో మొదటివాడు బిచ్చగాడూ, బిచ్చగాడి కొడుకు కూడానూ. వాడు పదేళ్ళవాడై ఉండగా తల్లిదండ్రులు పోయారు. అప్పటినుండీ వాడు తన తండ్రి అడుగుజాడలలో బిచ్చం ఎత్తుకుని జీవిస్తున్నాడు.

రెండోవాడు తాను పేద రైతుననీ, తనకున్న కొద్ది పొలమూ కిందటి ఏడు వరదలో మునిగిపోయిందనీ, తనకు తిండీ, గొడ్డుకు మేతా లేకుండా పోయిందనీ, అందుచేత తాను పొలం చేసుకునేటందుకు పెట్టుబడి లేక, పొలాన్ని కౌలుకిచ్చి, కూలిపని చేసుకుని బతకటానికి నగరం వచ్చాననీ చెప్పాడు.

మూడోవాడు పండ్ల వ్యాపారి. చాలా కాలం కూడబెట్టిన డబ్బుతో చెల్లెలికి పెళ్లి చేశాడు. తరవాత అతడి తండ్రికి జబ్బు చేసింది. వ్యాపారం కట్టిపెట్టి, తండ్రి చికిత్సకోసం ఊళ్ళూళ్ళు తిరిగి, చేతిలో ఉన్నదంతా పూర్తిగా పోగొట్టుకుని, బికారి అయాడు. తండ్రి బతకనే లేదు. అతనికింకా తల్లీ, ఇంకో చెల్లెలూ ఉన్నారు. ఇల్లు ఉన్నది. కాని పల్లెటూళ్ళో ఇప్పుడు పనులు లేవు. అందుకోసం కూలి చేసుకుందామని నగరం వచ్చాడు.

నాలుగోవాడు తండ్రి పోయేనాటికి పది ఎకరాల భూవసతి కలవాడే, కాని ఏ పనీ చెయ్యటం ఇష్టంలేక, ఉన్నదంతా తాగటానికీ, జూదానికీ తగలేశాడు. భార్య అతన్ని విడిచిపెట్టి, పుట్టింటికి పోయింది. అడుక్కుతినటానికి అతను నగరం చేరాడు.

అందరూ నిద్రపోయాక రాజూ, మంత్రీ లేచి, నలుగురి జేబుల్లోనూ నాలుగు

బంగారు నాణాలు వేసి, వెళ్ళిపోయారు. తెల్లవారగానే నలుగురు పేదవాళ్ళూ లేచి, తమ జేబుల్లో ఉన్న బంగారం చూసుకుని సంతోషించారు. వారిలో రైతూ, పళ్ళ వ్యాపారీ తమ గ్రామాలకు తిరిగివెళ్ళి, బంగారం అమ్మిన డబ్బుతో తమ వృత్తులు మళ్ళీ కొనసాగించుకో గలిగారు. తాగుబోతు తన బంగారంతో తాగి, మళ్ళీ యథాస్థితికి వచ్చాడు. వాడి మకాం సత్రమే.

బిచ్చగాడికి మటుకు ఆ బంగారు నాణెంతో ఏం చెయ్యాలో తెలియలేదు. వాడి వృత్తికి అది ఏ విధంగానూ పనికి రాదు. వాడు పది ఇళ్ళ వద్ద ముష్టి ఎత్తి, కడుపు నింపుకుంటాడు; వాడి జీవితం వెళ్ళమారిపోతుంది. బంగారం తనకు ప్రస్తుతం ఏ విధంగానూ ఉపకరించదు. దాన్ని ఎవరికన్నా అమ్ముదామన్నా, లక్ష ప్రశ్నలు వేసి, దొంగతనం కూడా అంటగట్టవచ్చు. అందుకని వాడు ఆ బంగారు నాణాన్ని సత్రం గోడ దగ్గిరే పాతిపెట్టుదామని, అర్ధరాత్రివేళ గుంట తవ్వసాగాడు.

ఇంతలో రాజభటులు దొంగను ఒకణ్ణి తరుముతూ అటుగా వచ్చి, బిచ్చగాడే దొంగ అనుకుని, వాడి వద్ద నాణెం చూసి ఆ మాట రూఢి చేసుకుని, వాణ్ణి రాజు వద్దకు తీసుకుపోయారు. రాజూ, మంత్రీ వాణ్ణి గుర్తించి వదిలేశారు. మిగిలిన ముగ్గురి సంగతీ ఆరా తీయగా తెలిసినదేమంటే, వృత్తి చేసుకుంటూ కారణాంతరాలవల్ల చితికిపోయి, దరిద్రులైనవారు ధన సహాయంతో బాగుపడ్డారు. ఏ వృత్తీ లేనివాళ్ళకు ధన సహాయంవల్ల కొంచెం కూడా లాభం కలగలేదు; వాళ్లుమామూలు స్థితిలోనే వుండిపోయారు.

మంత్రి రాజుతో, "మహారాజా, అసలైన దరిద్రుడు' ఖర్చు చెయ్యటానికి డబ్బు లేనివాడు కాదు, ఉత్పత్తి కొనసాగించటానికి తగిన మదుపు లేనివాడు. అలాటి వాళ్ళకు మాత్రమే ధన సహాయం అందాలి," అన్నాడు.

రాజు శివసేనుడు, మంత్రిమాటను అంగీకరించాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



Gopal Shroti





Mohan D. Desai

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలనూ సంబంధం ఉండాలి.)

★ జులై నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పండ్లు తింటున్నాయి

రెండవ ఫోటో : పండ్లు తినమంటున్నాయి

పంపినవారు : టి. లక్ష్మణమూర్తి. కీలపట్ల. (చిత్తూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.









ఛాంపియన్ 36
సైజులు 9-11½, 12-1½, 2-5
రూ 32.95, 36.95, 42.95

బల్లేరినా 46
సైజులు 9-11, 12-1, 2-6
రూ 25.95, 28.95, 32.95

లిలిపుట్ 22
సైజులు 5-8, 9-11
రూ 17.95, 19.95

## స్కూలుకు వెళ్లడానికి *Bata*

**Results of Chandamama—Camlin Colouring Contest No. 8 (Telugu)**

*1st Prize* : K. Banu, Eluru. *2nd Prize* : M. Sheshachalam, Hyderabad. *3rd Prize* : B. Nirmala, Machilipatnam. *Consolation Prizes*: K. Rajani, Vizag; K. Samba Siva Rao, Vijayawada; Y. Jaya Sri, Tenali; D. Anand. Hyderabad; S Srinivasa Rao, Visakapatnam.

# పిల్లల్నేమో లాలించాలి, లాలిస్తే ఏపుగా పెరుగుతారు






ప్రీతితో యిచ్చేది

## పార్లే గ్లూకో మజా రుచితో ఎంతో శక్తితో

పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్ మజా రుచులతో నిండి, పుష్టి నిచ్చే లక్షణాలు గలది.




గ్లూకో

భారతదేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్—
వరల్డ్ అవార్డ్ విజేత

everest/78/PP/131-tl